



# అచ్చతెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

తృతీయాశ్వాస పద్యకావ్యము







గ్రంథకర్తలు

నల్లంతిఘుల్ చక్రవర్తుల

తంయాల లక్ష్మీనృసింహాచార్యులవారు

ప్రకాశకులు

కటకం నరసయ్యా, వీరన్నగార్లు



[దీనివెల రు ౧

శ్రీ మతే రామానుజాయ నమః

# (అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము)

(మూఁడాశ్వాసముల ప్రబంధము)

గ్రంథకర్తలు

నల్లంతిఘుళ్ చక్రవర్తుల తంయాల లక్ష్మీనృసింహాచార్యులు

ప్రకాశకులు

అ

జ్ఞాతా
రిదినేంద్రలోచ
నుఁడహార్యత్వాత్మపద్ధైర్య
స్థశ్రీ। కుబ్జాచిత్తహారాంఘ్రి
యుగ్మకజభృంగుల్ నారసింహాఖ్య
నైశ్వర్జ్ఞుండున్నాటిపేరయా
హ్వయుఁడుప్రఖ్యాతార్థజ్ఞనై
సోదరుల్ కుబ్జాకృష్ణ
విలాసముచ్చు
పడగాఁగూర్చిం
చిరత్యు
న్నతిన్
శ్రీ

మొదటి కూర్పు కాపీలు 1000

రాజమంద్రి

౧౯౩౭

 [దీనివెల రు ౧

# తొలిపలుకు



అభినవరూపశేఖరులారా !

ఈ ప్రబంధమిప్పటి కిరువదైదు వత్సరముల క్రిందటనే నెరవేరెను. కావ్యరచన కిదియే నూతనప్రవృత్త్యగుటచే, (ప్రమాదోధీమతామపి) యను న్యాయానుసారము, ప్రమాదములుండు ననుసంశయంబున ప్రచురింప నిచ్ఛబొడమకుండెను. క్రమక్రమముగా ఇంక కొన్ని గ్రంథములు విరచింపగలిగినందులకు మిత్రులెందరో యీ గ్రంథముద్రణకై ప్రోత్సాహమొనరించిరి. సవరింపులు కానందున గ్రంథముద్రాణానుకూల ద్రవ్యాభావంబున కాలవిళంబమయ్యెను. నా కాలంబున పండిత ఫుంగవులీ పొత్తమును వీక్షించి ముద్రణప్రయత్న ప్రోత్సాహమొనరించిరి. వారి వాగ్రమ తప్పనిదై అట్టి తరుణంబుననే ముద్రణద్రవ్యం బొసంగెదమని కటకం నృసింహ వీరన శెట్టులు, వాగ్దానమొనర్చిరికాని నాగృహాపరిస్థితులచే వత్సరద్వయకాలంబతీతమైనది. అది మొదలీవరకు మరలి కావ్యమును ముద్రణస్థితిలోనికిఁ దెచ్చి ముద్రింపగలిగితిమి.

ముద్రణసమయమున మేము స్థానాంతరస్థితులమగుటచే సవరణ బహుళమైనను ముద్రణస్ఖాలిత్యము లుండుననుగాన పాఠకులు యథామతిగ సంప్రతించు కొనబ్రార్థితులు.

ఇట్లు విన్నవించునది
గ్రంథకర్త, నివాసస్థానము
ఓరుఁగల్లు.

# పీ ఠి క

శ్లో॥ అపారేకావ్యసంసారె । కవిరేకః ప్రజాపతిః ।
యథాస్మైరోచతే విశ్వం । తథేదంపరికల్ప్యతే ॥

రసికవతంసులారా,

కావ్యప్రపంచము నిరవధికమైనది. కవి తనమనశ్శక్తి ననుసరించి కవితాశిల్పకళ నుపదేశించును. కవీంద్రుఁడు తన మనోరథము ననుసరించి విధాతవలెఁ గావ్యప్రపంచము నిర్మించును. కవులకల్పనాశక్తి ప్రతిభాతరంగముల నూగులాడుచుండును.

శ్లో॥ శృంగారీ చేత్కవిఃకావ్యే । జాతం రసమయంజగత్ ।
సచేత్కవిర్వీతరాగో । నీరసంవ్యక్తమేవతత్ ॥

కవి శృంగారరస పరతంత్రుడైన కావ్యములుగూడ శృంగార స్రవంతి నవగాహన మొనర్చుచుండును. కవి విరాగియైనచో గావ్యములుగూడ నీరసముగా నుండును. నీరసముగా నుండు కావ్యములు సహృదయహృదయరంజకములు కానేరవు. చమత్కృతిరహితములగు కావ్యములు తృణపురుషసదృశములు.

పాఠకులకు హృదయానందము నొసంగి నీతిని బోధించునవియే యుత్తమకావ్యములు. యే విధముగనైనను సుకుమారమతులకు నీతిని బోధించుటయే కావ్యరచనా ప్రయోజనము.

దృశ్యములనియు, శ్రవ్యములనియు, కావ్యములు రెండువిధములు. నటకులచేత రంగస్థలమునందు ప్రదర్శింపదగినవి దృశ్యములు. వినఁదగినవై ప్రదర్శనానర్హములై వెలయు పురాణములు, ప్రబంధములు, శ్రవ్యకావ్యములు ఇవి పండితుల పాండితీచాతురికి నికషోపలములు. అష్టాదశవర్ణనా సహితములగు కావ్యములు మహాకావ్యకక్ష్య నధిరోహించును.

ఆంధ్రభాషాయోషకు భాషాంతరీకరణమున నిరుపమానసామర్థ్యము గలిగిన కవిత్రయము పెట్టినదే యాదిభిక్ష. ప్రబంధపరమేశ్వరబిరుదంబు ధరించిన ఎఱ్ఱాప్రెగ్గడవంటి కవు లనేకు లదిమొదలుకొని తమ కవితాకన్యకను ప్రబంధడోలికలఁ గూడా నుయ్యాలలూపుట్కై దల చూపసాగిరి. కూచిమంచి తిమ్మకవి మొదలగు కవీంద్రులు మిశ్రప్రబంధములనే గాక యచ్చ తెనుఁగు ప్రబంధముల సహితము రచించి యశశ్శాలులైరి. పురాతన కవి తిలకుల యాశీర్వాదమే, వారిదయారసమే, యధునాతన కవిశేఖరులకాలంబనము; ఆంధ్రభాషాలలామకు జీవగఱ్ఱ.

మిశ్రబంధరచనకన్న, నచ్చ తెనుఁగు పలుకుబడులచే చిత్రితమగు కావ్యరచన, మిక్కిలి కష్టము. కావుననే నంతర్వాణీంద్రులకది సరస్వతీ పీఠము.

## గ్రంథకర్తృప్రశంస.

అచ్చ తెలుఁగు ప్రబంధమగు నీ కుబ్జాకృష్ణవిలాసమును రచించిన కవినాథులు శ్రీమాన్ స్నళ్లంతిఘల్ చక్రవర్తుల, తంయ్యాల, లక్ష్మీనృసింహాచార్యులవారు, వీరికి, తంయ్యాలయని, బిరుదనామము. వీరి నివాసము, వరంగల్లు. గోత్రము, హారితసగోత్రము. జనకుఁడు రంగాచార్యులవారు. వీరు వేల్పుగొండ లక్ష్మీనృశింహస్వామి కరుణాకటాక్షలబ్ధవాగ్విభవానుభావులు, ఆంధ్రభాషాప్రవీణులు, చతుర్విధకవితాప్రబంధరచనా నిర్మాణధురీణులు. ఈ విషయమంతయు నాశ్వాసాంతగద్యవలన స్ఫుటమగుచున్నది. వీరీ యచ్చ తెనుఁగు ప్రబంధమునే కాక నిరోష్ఠ్యాద్యేతర గ్రంథములనుగూడా కొన్ని రచించిరి. వీరి కవితాశైలి సులభశైలి. పండిత పామరజనమున కానందమొసఁగును. పురాతనకవీశ్వరుల పోకడలు వీరి గ్రంథంబున గన్పించుచున్నవి.

ఈ కుబ్జాకృష్ణవిలాసమునందలి ద్వితీయాశ్వాసము నందలి వర్ణ నాంశములు, తృతీయాశ్వాసము నందలి కూర్మబంధము, మర్దళబంధము, ఖడ్గబంధము, మొదలగు బంధవిశేషములును, గర్భితమైన చతుర్విధకందములును, కందగర్భ చంపకమాలావృత్తము మున్నగు వృత్తవిశేషములును వీరి పాండితీవైభవమును జాటుచున్నది.

(కుబ్జా వృత్తాంతము)

మధురాపత్తనమును నుగ్రసేనుడు పరిపాలించుచుండెను. ఆతని పెద్దకొమారుడు కంసుడు. అతనికి నూడిగముసేయు దాసి కమల. దీనిభర్త కోమలుడు. ఈ దంపతులు సంతానములేక తపోవనంబున నున్న గర్గమహర్షి చెంతకుఁ జని, యతనివలన తనకొక కుమార్తెగలుగు ననియు, శ్రీకృష్ణుడు వరించుననియు, విని సంతసించి తిరిగి గృహంబునకు జనుదెంచి పిదపఁ గొన్నిదినంబులకుఁ గమలగర్భవతియై సుముహూర్తమున నొకకూతును గనెను. ఆబాలికామణి పేరు కుబ్జా.

(కుబ్జా పూర్వ వృత్తాంతము)

కుబ్జా ముప్వంకలు గల శరీరముకలది, ఈ బాలిక పూర్వజన్మమున, రావణుని చెల్లెలగు శూర్పణఖ. శూర్పణఖ పంచవటియందు శ్రీరామచంద్రుని మోహించి తనను వరింపుమని యనేకవిధంబుల వేడుకొనెను. కాని యప్పుడాతఁ డంగీకరింపలేదు.

శూర్పణఖ పతివ్రతాలలామయగు సీతాదేవిని మ్రింగబోవఁగా లక్ష్మణుడు, శూర్పణఖ ముక్కుచెవులు ఖండించెను. అంతశూర్పణఖ విచారపడి, దుఃఖించుచు రావణుని చెంతకుఁ జని, తనవృత్తాంతమును, విన్నవించి, జానకీసౌందర్యముల వర్ణించి. వైదేహియందు, దశముఖుని కనురాగము కల్పించి తాను తపంబున కేగెను.

పుష్కరతీర్థమున శూర్పణఖ పదివేల వత్సరములు, శివునిగూర్చి ఘోరతపం బొనర్చెను. ఈమె తపంబునకు మెచ్చి, శివుడు

ప్రత్యక్షమయ్యెను. శూర్పణఖ లోకాభిరాముఁడగు శ్రీరామమూర్తిని నాకు భర్తగా నొసంగుమని వరం బడిగెను.

శివుండా యువతినిజూచి, శూర్పణఖా, ద్వాపరాంతంబున నీ రాముఁడే కృష్ణుఁడుగా నవతరించి నిన్ను చేపట్టగలఁడు. విచారపడకు మని వరంబిచ్చి అంతర్హితుఁడయ్యెను. ఇది కుబ్జాపూర్వవృత్తాంతము.

ఆ కారణముననే శ్రీరాముని యవతారమగు శ్రీకృష్ణుఁడు, మధురాపట్టణమున దేవకీవసుదేవులకు, జన్మించి, యశోదాదేవి ప్రేమ సర్వస్వమై, మనోహరములగు లీలలచే, నా బాలగోపాలము నానందాబ్ధిలోమునుఁగ జేసెను.

ఒకనాడు కుబ్జ కంసునికి సుగంధద్రవ్యముల తీసుకొని వెళ్లుచుండెను. అప్పుడే రాజమార్గంబున కంసునిచే నాహూయమానుండై శ్రీకృష్ణుఁ డక్రూరసహితుండై గోకులమునుండి విచ్చేయుచుండెను. కుబ్జ తన యపాంగప్రసారమును కృష్ణునిపై బఱపి యాతనిని పరిమళ ద్రవ్యముల నైకొనుమనెను. అతఁడు గ్రహించెను. శ్రీకృష్ణుఁడు, ముచ్చంకలుగల కుబ్జయొడలు, చక్కఁగ నొత్తదలచి, తత్పదంబులమీఁద తన పదంబులనునిచి హస్తాంగుళద్వయమాత్ర మా యబల నడుముక్రింద నిడి మీఁదికి లేవనెత్తగా కుబ్జ వక్రత్వము వీడి సుందరమూర్తియై నిలిచెను. కుబ్జకు కృష్ణునిపై మోహమది మొదలతిశయించెను. గృహమునకు వచ్చి విరాళిగొని మదనబాధ సహింపజాలక పద్మినియను దూతికను కృష్ణునిచెంతకు బంపించెను. కృష్ణుఁడే తెంచి, కుబ్జమనోరథము తీర్చెను. ఇది యీ గ్రంథమందలి కథ.

## కవితాశైలి.

ఈ కుబ్జాకృష్ణవిలాసము భగవద్భక్తుఁడగు బమ్మెరపోతరాజుచే రచియించబడిన భాగవతము నందును, గర్గభాగవతమునందును గలదు. పదిపద్యములతో నై గ్రంథములయందు నుడువఁబడిన, యీ కథ, యీ

ప్రబంధమునందు మూఁడాశ్వాసములలో ముచ్చటగా నభివర్ణింపఁబడినది.

కమలాకోమలులు, గర్గమహర్షి చెంతకు జని, తనపూర్వవృత్తాంతము, నడిగి తెలుసుకొను సందర్భమున, కుబ్జాకృష్ణులపూర్వవృత్తాంతమును, మధురములగు కృష్ణలీలలను వర్ణించుటఁజూడ గ్రంథకర్తృసమయోచితకల్పనా చాతుర్యము వ్యక్తమగుచున్నది.

మఱియు నాయాసందర్భములందు దశావతారములను, సుకుమారపద గుంభనముచే నుడువుటయు, మూలగ్రంథములలో లేని దూతికాకల్పనము గల్పించుటయు, నాలోచింపఁ బై విషయము నే ధృవపఱచుచున్నది.

కవితాశైలి పండితపామరహృదయంగమమై కవియొక్క రచనా నైపుణ్యమును, భావగంభీరతను, బోధించు చున్నది. ప్రాచీనకవితల్లజులత్రోవ ననుసరించి యిందు పురవర్ణనము, స్త్రీవర్ణనము, వనవిహారము, జలక్రీడ, మన్మథోపాలంభనాది వర్ణనములు, సరసులహృదయమును నాకర్షించునటుల రచింపఁబడినవి.

ఇందలి రసము, శృంగారము, అది కుబ్జామనోగత రత్యుపాధికమై గోపీలోలుఁడగు శ్రీకృష్ణుని యాలంబనము గలిగి కుబ్జాకటాక్షాద్యను భావసమ్మిళితమై జౌత్సుక్యాది వ్యభిచారి భావపరిపోషితమై వనవిహారాద్యుద్దీపన విభావసముజ్జృంభితమై సమగ్రముగ నిందు సాధించఁబడినది.

ఇట్టి యత్యుత్తమమగు యచ్చతెనుఁగు ప్రబంధమును రచించిన గ్రంథకర్తృ కవితా ప్రాశస్త్యము దెలియుటకై, మచ్చునకొకటి రెండుదాహరణము లొసంగెద.

క. చెందొవలఁ దూఱుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయ కేలడుగులున్

చందురు బురణించెడు మో
మందముగల చెలినిజూడ § నబ్బురమయ్యెన్.

క. విండ్లాబొమ్మలు తమ్ముల
తూండ్లా కేల్ దోయి మిసిమి § తోరంబగు పూ
చెండ్లా గుబ్బలు మొత్తని
దిండ్లాలలి పిరుదులలరు § తెఱవకు దలపన్.

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల § చెండులాడు
తరినొకటి నొక్కరితపైట § దవిలిజిక్క
మూడుపాలిండ్లు గలిగిన § ముగుదయనుచు
పొలతులందరు నవ్విరి § పొలుపులెసగ.

క. డాలాపిక్కలు క్రొంబవ
డాలా కెమ్మోవి § తమ్మిడాలాయడ్గుల్
డాలాచూడ్కులు నునునవ
రాలాజడతీవి బొంగ § రాలా చన్నుల్.

ఈ విధము రసవంతముగ, నీప్రబంధమును రచియించిరి. మరియు నిందలి (73) పేజీయందలి, గద్య, ప్రాచీనులగు, నచ్చతెనుఁగు ప్రబంధ కర్తల, ధోరణి నతిశయించు చున్నదా యను విభ్రాంతిని, పాఠకులకుఁ గల్గించుచు, గమ్మచ్చున దీసినటుల సుకుమారములగు నచ్చతెనుఁగు జానుపలుకుఁ బడులగుబాళించుచు, మనోరంజకమై యొప్పారుచున్నది. ఇటులే (100) వ పేజీయందు వచనరచనయు, (109) వ పేజీయందలి దండకము, కుడియెడమగా దీని ననుకరించు చున్నవి.

ఈ కాలమున నచ్చతెనుఁగు ప్రబంధముల రచించువారలే యరిదిగా గన్పట్టెడిని, అందున నీ యాచార్యులవారు మిక్కిలి శ్రమ పడి ఇట్టి యుత్తమగ్రంథమును, నచ్చతెనుఁగున రచించి, యాంధ్రభా

షావధూటీ పాదపద్మముల నొక సువర్ణాభరణము, నొసంగి యమూల్యసేవఁజేసి నందులకాంధ్రమహాజనుల కెల్లరకు శ్లాఘనీయులు. వేల్పుగొండయందు భక్తుల నుద్ధరించుటకై, యవతరించిన లక్ష్మీనృసింహస్వామి, వీరి కాయురారోగ్యైశ్వర్యముల నొసంగి, వీరికి గ్రంథరచనాకౌశలమును, నిత్యాభివృద్ధిగా నొసఁగుఁగాత.

28–11–32
సంస్కృతవిద్యాశాల
ఓరుగల్లు

ఇట్లు
బుధజనవిధేయుఁడు
విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి

# పీఠిక

(దాతృ ప్రశంసా)

క. శ్రీకినికాపురమై వి
ప్రాకలితంబై యనేక • హరిహరభవన
స్తోకంబై సంతతశుచి
కాకరమై యోరుగల్లు • పావనించె భువిన్.

గీ. సరగను ప్రతాపరుద్రభూ • జాని భుజబ
లావనత నొందియుండు మ • హాప్రశస్త
సంపదల కాలవాలమై • సంస్మరింప
దిట్టయైయున్న యోరుఁగ • ల్పట్టణంబు.

గీ. వైశ్యకులమణులు కటకంసు • వంశముక్త
లఖిల సద్గుణవేదు ల • త్యంతసుఖులు
గొంటకులగోత్రు లీశ్వర • కోమలారు
ణాంఘ్రిసంస్మరులయ్యు పెం • పందిరచట.

ఉ. ఆ పరమాన్వయంబున మ • హాంబుధిగన్న సుధాంశుపోలికన్
పాపము తాపదైన్యముల • బాపినకల్పక చంద్రగంగలన్
రూపునుమాపి సజ్జనుల • రూఢిపదార్చ్యల సంతసింపుచుం
జూపడె ధర్మమూర్తియయి • జొక్కెనుబాలయసెట్టి యొక్కఁడున్.

ఉ. బాలయసెట్టి ధర్మనయ ♦ భావముల న్వెలుగొంది నొక్క క
న్యాలలితాంగి బెండ్లియయి ♦ న్యాయముదప్పక పుత్రరత్నమున్
దాలిమితోడఁ గాంచెలలి ♦ తంబుగ వీరనసెట్టిపేరునన్
గ్రాలిచరించె బేరములఁ ♦ గాదిలిసేసి యశంబుజొప్పడన్.

క. రతికినిసమమై శ్రీ భా
రతిసతుల గుణాదికముల ♦ రంజిలి భువి సం
మ్మతిఁగల్గి యల్లమాంబను
హితమతితో బెండ్లియాడె ♦ హితులు బొగడగన్.

సీ. ఆవీరనశ్రేష్ఠి ♦ యాత్మపత్నినిఁ గూడి
పుణ్యాపగ క్షేత్ర ♦ ములనుఁ దిరిగి
సత్యవాఙ్నియతులఁ ♦ జాలబేరము లాడి
పిన్నపెద్దలలోన ♦ పేరువడసి
దశరధ నృపువలె ♦ తనయుల నల్వుర
గనియెను పెద్ద వెం ♦ కన్న యనఁగ
చిన్నవెంకన్న నా ♦ చెలఁగి మంగయయన
తుదకు శివ్వయ యనఁ ♦ దుల్లఁదూగి

గీ. రతులవిభవ సుభోగభా ♦ గ్యముల నెల్ల
ననుభవింపుచు మిక్కిలి ♦ యార్యసభల
త్యాగరాగవిరాగ సం ♦ యోగభోగ
ములకు తావలమైరి స ♦ మ్మదముఁ గలుఁగ.

గీ. పెద్ద వెంకయ్యశెట్టి తా ♦ ముద్దియ నొక
రితను పెండ్లాడి గేస్తుబా ♦ డి తొలఁగకను
ధర్మముల ధనము వ్రయపెట్టి ♦ ధరణివెలసె
సంతతులనిల్పె నేలపై ♦ సంతుకొరకు.

వ. అందు చిన్నవెంకయ్యశెట్టి తెరంగు వినుపించెద.

ఆ. ఔరయిచటి పున్నె ♦ మబ్బురం బయ్యెడు
జన్నిగట్టులెపుడు ♦ జన్నములకు
నెయ్యిఁ వేల్చుచుండు ♦ నేటగుఁ బ్రాబల్కు
సారముపీను లలర ♦ సొంపుసేసె ౧౦౫

సీ. పూవుఁగుత్తుల నొప్పు ♦ దీవెలపై జుమ్మ
జుమ్మని మ్రోగెడు ♦ తుమ్మెదలును
కమ్మనిమావులఁ ♦ గలవనలనుఁ దిని
కూకలేయుచునున్న ♦ కోగిలములు
చీఁకటిమ్రానులఁ ♦ జేరి మబ్బులటంచు
నట్టాడుచుండెడు ♦ నమిలిగములు
దెసలనెక్కడనైన ♦ మిసమిసలాడెడు
కస్తురిపిల్లుల ♦ కమ్మతావి

ఆ. చదలనంటుచున్న ♦ జన్నంపుక్రొంబొగ
లౌరదారినేగు ♦ వారియుల్ల
మలరఁజేసె నిచట ♦ నవ్వారి పనులైన
చక్కబడుసటంచు ♦ చనువుగలిఁగి. ౧౦౬

ఆ. పోయిపోయి యెదుట ♦ బులితోలుఁబఱచిన
గద్దెపై నిరుసుల ♦ గమిఁగొలువఁగ
గూరుచుండి తెలివి ♦ గుర్తులుఁ దెలుపుచు
హరునమెడ్డలోన ♦ నగ్గలింప. ౧౦౭

చ. బసుపుము మేనఁబూసి చెలు ♦ వంబగు దామెరపూసలకుక్కనన్
మిసిమిజెలంగవేసి యఱి ♦ మించుజడల్ జిగికావిపుట్టముల్
మసలఁగ కక్కపాలయును ♦ మచ్చికమీఱఁగ దాల్చియున్న పె
న్నుసియగు గద్దెనొక్కరుని ♦ నోములుబండఁగ జూచిరిమ్ముగన్.

చ. కనుఁగొని యంజదమ్ములకు ♦ గాదిలిమ్రొక్కులు మ్రొక్కి గుండెబ
త్తిని పొనకాడ నెన్నదురఁ ♦ దిన్నగ చేతుల జంటమోడ్చి మె
ల్లనరుసివేల్పురాయనికి ♦ లక్కన మొప్పెడు సుద్దివాకొనెన్
దనఁదగు పోలుపొందువిని ♦ తమ్ముదలిర్పఁగ సేయునట్లుగన్. ౧౦౯

ఉ. ఓజడదారి రాయవిను ♦ మూరటలేకయు కక్కసంపురా
లోజచెలంగుదాఁడులకు ♦ నోడక నాజవరాలిఁగూడి రా
డేజుగతొల్లి యున్నమరు ♦ డెంచుటచేఁ గడగండ్లబాసి వేఁ
మీజతనంపుఁ దోఁటహరు ♦ వింపెసఁగన్ గననయ్యెనియ్యెడన్.

ఉ. వచ్చినతోడనే నిటకు ♦ వచ్చితినాడు తలంపునీకు వా
క్రుచ్చితినన్న నత్తపసి ♦ కోమలునిం గనివల్కె నెమ్మితో
నెచ్చటికేగెదో యిచటి ♦ కేలరుదెంచితివేది ప్రోలు నీ
కిచ్చటఁగోరు గోర్కులన ♦ వేవియుదెల్పుము పేర్మితోననన్. ౧౧౧

గీ. మధురనాఁప్రోలి లోపల ♦ మనికినాది
వేడుకను జేసికెప్పుడు ♦ వీఁకమీఱ
పునుఁగుజవ్వాది గందముఁ ♦ బూయనిచ్చి
వచ్చెదు వలంతికమలినా ♦ వలపురాణి. ౧౧౨

వ. నా పేరు కోమలుండ మే మిరువురము. ౧౧౩

ఉ. దొడ్డతఃంబు కల్మిఁగని ♦ తొల్లిటికావల మువ్వతిల్లఁగన్
బిడ్డలులేక బెంగగొని ♦ బెగ్గిలికంబును చిప్పిరిల్లఁగా
నుడ్డమొగంబు వేల్పునెద ♦ నొప్పకము త్తికిఁ ద్రోవలేని కా
ఱొడ్డెముఁవాసె మాకును మె ♦ ఱుంగగునాయుని యొక్కవేకువన్.

క. కలువరపడిరోసియు నా
యిలు చెలువలకంకెఁజేసి ♦ యిటురాఁగనుచూ
తొలిమేననేయు వున్నెం
బులుఁగలుఁగుటవలన మిమ్ము ♦ బొడగంటి మొగిన్. ౧౧౫

క. కారానిపనులు మీఁచే
గారాబమ్మునను దీర్పఁ ♦ గానగునంచున్
గోరిక నుడివితిమి నిరా
బారికఅదతమ్మివిప్పు ♦ పగటిదొరయనన్. ౧౧౭

గీ. ఆలకించుచు జోగితా ♦ నబ్బురమున
కోమలుడుబల్కు సుద్దుల ♦ కుమ్మఁదెలిసి
జరుఁగబోయెడుఁ జరిగిన ♦ జరుగుచున్న
వైనములఁజూచి మాలిమిఁ ♦ బూనిపలికె. ౧౧౮

మ. వినువీడుంగలమేల్ నుగంబులను ♦ వేవేఘాంపగా సంతువున్
గనినగ్గాని పునెంబుఁగల్గదని యీఁ ♦ గ్రాల్గంటితోవచ్చి మె
త్తనిమైతోఁటబమందుఁ గాసిలఁగనెం ♦ తంజేసి ముప్పోకలా
డొనరింపంగల మేలునొందెదనియో ♦ హాతల్చితేఁ జూడఁగన్.

ఉ. నీవుదలంచి వచ్చినప ♦ నిన్నెరవేర్పగలండు ప్రబ్బుమై
దేవరయిల్లుఁ జేసుమనఁ ♦ దెల్లమికై మఱిబల్కెయోరుసీ
తావరమందు నుండివలు ♦ దాపులనోములు నోచియుండఁగా
యోపగనైన సంతుగలి ♦ గించుటలేమిని గీమువెల్లితిన్. ౧౧౯

వ. వెండియు జగమ్మున నల్వయు. ౧౨౦

ఉ. సంతువటంచు మొఱ్ఱలిడి ♦ సారెకుమ్రొక్కఁగరాని వేల్పుమేల్
చెంతకుఁజేరి సేతగని ♦ సేతలుసేసినఁగాని వారికిన్
ఫంతముఁ గట్టినట్లు మురి ♦ పంబునుఁజూపెడు సంతుగూర్పకే
వంతల పాలుఁజేసియుది ♦ వల్దనువారికి నిచ్చుపెక్కుఁగన్. ౧౨౧

సీ. సిరిగలవారెనిఁ ♦ జేయుతెగుల్గల్గ
పేదలకాకలి ♦ బెట్టుపెక్కు
సమకూర్చుముదు కని ♦ జవ్వనికిని జాణ
తకుఁగూర్చు తులువను ♦ తగుగొనములు

గలమేటికిచ్చు ని ♦ చ్చలు నఱ్ఱబ్రతుకును
బ్రల్లదుఁడకు నిచ్చు ♦ బ్రదుకునిడుద
తేగముల్ గలవారి ♦ తెగకులేమి యొసంగు
నీలేనివారల ♦ కిచ్చుకలిమి

గీ. గానఁదగనట్టి చెయ్దుల ♦ బూనినేయు
నలు మొగంబుల వేల్పు కే ♦ కలవరంబొ
ముప్పుదప్పిన తుదుసలి ♦ యెప్పుడైన
నేయఁదగినట్టి పనులను ♦ నేయఁగలఁడె. ౧౨౨

వ. అయినను తొల్లింటి బాముసఁ జేసికున్న కసటునన్మాకు కొడుకులు లేనిది కొంతగలదియై మునిగితిసుగంబు దప్పించినది గావున మీరు వివరించు వివరంబు తేటతెల్లమిఁజేసి బిడ్డలుఁగలుఁగు తెఱఁగు లెట్టులనో యేర్పరించుటకు మీ యట్టి పెద్దలవలనం గదా కొంకులు విడుచుట యనుటయు రుసిచందురుఁడు. ౧౨౩

ఉ. జవ్వనిమిన్న కోమలుఁడ ♦ సారెకు సారెకు మీతలంపులో
నెవ్వఁగ నొందనేల తొలి ♦ నిండిన దోసము నూఁడువంకలున్
నివ్వటిలంగ కన్నెకయు ♦ నెప్పరియొక్కతె బుట్టుదానిచే
మవ్వపుముత్తిగల్గు విసు ♦ మానవువంకలడంగు బిమ్మటన్. ౧౨౪

గీ. వెలయముప్పొక లెఱిగిన ♦ వేల్పుతేని
చెలిమిఁగావించు మగలాఁగు ♦ సేతతోన
తనివిసనఁ గొల్చికొడుకు నొ ♦ క్కనిని గనును
గానయిలుఁగూర్చి పొమ్ము మీ ♦ క్కనగు తలఁపు. ౧౨౫

క. నావినిరుసి మీసరకున
కావెలఁదుక బలికెముగితి ♦ నందించెడిదా
వావిరి ముప్వంకలు దిగి
బోవుటెటుల చక్కఁజేయు ♦ ప్రోడయెవండో ౧౨౬

సీ. అదిగాక కలుసాన ♦ నొదవిన దానిని
ముప్పోకలాడేల ♦ ముట్టుకొనును
ముట్టుకున్నను లాఁతి ♦ ముద్దుగుమ్మలఁ జాల
నెనరు నించుటకేల ♦ నెగడుచుండు
నెగడెపోయతఁడేల ♦ నేనున్నతావున
కరుదెంచు నయ్యౌత ♦ గ్గనకబొమ్మ
గ్రుడ్డులోపలి పజ ♦ కూరిమిఁగాచగ
దలచియుండెను గాదె ♦ తల్లిదండ్రి
గీ. వలెను బత్తులఁ బ్రోవఁగ ♦ దలఁచిపుడమి
కరుగుదెంచునో లేకయిా ♦ యున్నమిన్న
నొక్కరితఁ బ్రోవ నేతెంచు ♦ నోకలంకు
వీడిపోదె ప్స హాసంబు ♦ విఱ్ఱవీఁగ. ౧౨౮
మ. అదిగాకింతకు వెన్కబాముసయహో ♦ యాకూసచే కొన్నమై
కొదుకుల్ నాకువటారిసుద్దులను వా ♦ క్రువ్వంగమిా కుంచగున్
ముదితన్ మేమెటుగాంచ గల్గుదుము బెం ♦ పుల్మీర నీముద్దబె
ల్లిదపూ దోసములీఁగుబెట్లగునొ తా ♦ ల్మిన్ దెల్పి మన్నింపవే.
క. సిరిపెనిమిటికే తలలో
దురుసగు సేతలనుఁజేసి ♦ త్రుళ్లెనొ నాకున్
దరవడిగఁ దెలియబలుకుము
పరిపరిడెందంబు చెదరె ♦ బమ్మెరఁగలిఁగెన్. ౧౨౯
వ. అనినవిని రుసిమూనికంబు నెట్టన రెట్టించిన సంతసంబుట్టిపడ నా దిట్టరులఁజూచి మిారు తలంకకుడు మిాతలంపొడఁగూడు దానిని తేటతెల్లమిఁజేసెదనని యిట్లనియె. ౧౩౦
గీ. మునుపు బహుళాశ్వుడను రాచ ♦ పులికివేల్పు
తపసిరాయఁడుఁ దెలిపిన ♦ దానిమిాకు

తేటతెల్లమి జేయుదు ♦ తిరిగితొల్లి
బాముననుసేయుదురుసుల ♦ పడఁతికతను ౧౩౧

సీ. మునుపుసీత మగండు ♦ మొనసిత డిరి యూన
కలికితో తమునితో ♦ కాన కేగి
పంచవటిని నాకు ♦ పాకనుగట్టించి
సుగముగా నుండఁగ ♦ శూర్పనఖయ
నెడు చెలియే తెంచి ♦ నేలనాయని చక్క
దనముసఁజూచి త ♦ త్తరముగదుర
వలరాయునికి మారు ♦ వలరాయుఁడగు వీని
పొందులేని వలంతి ♦ పుటుగుపుటుకె

గీ. యనుచు మది నెంచి సంతోస ♦ మగ్గలింప
తాను వలపుమిటారియై ♦ దగ్గరించి
కలికిచూపుల జూచుచు ♦ కలిమిడిగను
బలికెమొత్తని మాటల ♦ బన్మరించి ౧౩౨

ఉ. రాచకొమార నాకువల ♦ రాయని కన్నను మిన్న వొలచే
దోచెను పెండ్లియాడికల ♦ తోయము తీరు మొలంగవచ్చితిన్
బ్రోచెదవో మతిం వెడల ♦ ద్రోచెదవో విపరింపుమన్న నా
రాచకొమారుఁ డొద్దికను ♦ రావణు చెల్లెలితోడ నిట్లనున్ ౧౩౩

గీ. మెలఁత నాతోడబుట్టువు ♦ మెలఁతలేక
యున్నవాడదె వానితో ♦ నున్న నీకు
జేజెపట్టునఁ గలమంచి ♦ జెందవచ్చు
ననిపరక్కసి విని లక్ష్మ ♦ ణుని కదిసియు. ౧౩౪

ఉ. ఓమగనీదు చక్కదన ♦ ము వ్విళులూరఁగ సేయవచ్చితిన్
నామదికోర్కె దీర్చుమని ♦ నాతుకబల్కిన నవ్విలక్ష్మణుం

డోమడఁతీన నుంగొనిన ♦ నూడిగ మెవ్వఁడు సేయువాఁడనా
తోమటిచున్న నూడిగెపు ♦ తొత్తువటంచని బల్కెరేపజల్. ౧౩౫

కం. ఆనివిని యుద్దరిచెంగటి
కిని యిటునటుతిర్గితిర్గి ♦ కేచుచునుండన్
గనియొక్కటాలు బతమును
గొనుదశరథుకొడుకు వలపుఁ ♦ గొనకయెనుండన్ ౧౩౬.

ఉ. చక్కదనాల కుప్పయగు ♦ చానను బ్రిమింగిన నన్నుగొందురం
చొక్కమొయిం దలంచిమురి ♦ యుబ్యెలయై జెలువొందబ్రిమింగబో
నక్కటయించు ముక్కుచెవు ♦ లంటగగోయుమటంచు సన్నబీ
తెక్కఁగ జేయునట్టులొన ♦ రించెను తమ్ముఁడుకాఁకు దొల్గగన్.

గీ. ఇటుముకు చెవులుదరిగిన ♦ యింతియేగి
యన్నయగు రావణునితోటి ♦ యున్నదున్న
యట్లు వివరించి సీతహూ ♦ యలను దెల్పి
తెచ్చుకొననట్లుజేసి య ♦ త్తెఱవపొగిలి ౧౩౮

గీ. అంతటనుబోక కాఁక్రేని ♦ కంకియుపడి
పుష్కరంబను తీర్థము ♦ బోయియచట
మగపజయు సల్పుతబము నె ♦ మ్మదిగసేయ
బూనివిరికందువను చాల ♦ పూన్కిఁజేసి. ౧౩౯

గీ. నరవిపదివేల యేడులే ♦ నరములేక
మిత్తిగొంగను మదిలోన ♦ హత్తుకొనుచు
సేయగా వెండికొండను ♦ సీమగలుఁగు
గిబ్బతత్తడి రాతుతా ♦ కేరినిలిచె. ౧౪౦

ఆ. నిలచిదగ్గి మగడు ♦ నెలఁతయేమిటి కోరు
కొనెదవేమొ తెలియఁ ♦ గనుపరుచుమ

టంచు బలుకలేమ ♦ తవరఁగా నిల్లను
వేల్పు వేల్పుకొండ ♦ విడిచి జేజె. ౧౪౧

క. నాకోరిక వినుపించెద
చౌకనొనర్పంగవలదు ♦ చక్కనివాఁడా
రాకొమరుడు రామునికై
జేకొనమదికోర్కె బొడమె ♦ చేయుమన నీనెన్. ౧౪౨

క. ఒకటాలు బతిముబట్టిన
పకపకనగు మొగపురాచ ♦ పట్టినిచేప
ట్టకటాసాగునె యూర్కొ
మ్మొకరుంగునె వానియెడద ♦ ముందగుకోర్కెల్. ౧౪౩

గీ. ద్వాపరములోన తుదకును ♦ తాతతండ్రి
చెలఁగి దేవకికినిఁ బుట్టి ♦ చెనఁటివజను
ద్రుంపగావచ్చి నిన్ను చే ♦ నింపుగలుఁగు
కలవమును గొనియేలును ♦ గారవమున. ౧౪౪

గీ. అనుచు కోరినకోర్కిని ♦ యుగ్గికంటి
యొసఁగియేగిన పిమ్మట ♦ నొక్కపొద్దు
తోడనున్నంత వరకును ♦ తొలగనియెద
రాగవునిపైన మెలఁగఁగ ♦ రానయుండి. ౧౪౫

వ. బాముబామునకు పూవిల్తునకు పూవిల్తుఁడగు రాగవుండు దప్ప మరియొకరి నాకఅదకు తేఁడుఁ గాడని తలంచుచు నుసురులను వదిలె అది వెండియు ద్వాపరము తుదకు మధురయనెడు పట్నంబున కంసునికి బానిసెతనంబు సేయు కమలకోమలులకు జగము తల్లియగు చాలు పేరిటి సన్నవలఁతిని చెరబట్టించిన దోసంబీ బామునగల వేసంబునకు మువ్వంకలు గలిగించి కుబ్జ నా పేరట జెలువారుచుండునని. ౧౪౬

క. ఈరవళితొల్లి తఱిలోన్
సీరామునికిం దొసంగు ♦ జేసిన దోసం
బారంగ శూర్పణఖయును
బారుగముప్వంకలలరు ♦ బామును బొందున్. ౧౪౮

ఉ. ఆతఱిలోన రామునిక ♦ యారెయొసర్చినసె బ్రలెల్లయున్
దాతదలంచి చూచితిగ ♦ వంకలుగుజ్జుతనంబు నిచ్చియా
నాతుకకావలంబుఁ జన ♦ నల్లనిదేవర కాచునంచు మేల్
వ్రాతలువ్రాసె నీతలఁపు ♦ వాలెము సాగును బొందు వేడుకన్.

గీ. మంచివారలఁ బ్రోవఁగ ♦ మఱియు దెడ్డ
వారిఁద్రుంపఁగ బాముంది ♦ పాడినిలుప
నేలఁబుట్టును కఱివేల్పు ♦ నీకుశూర్ప
ణఖయను నెలంతకలుఁగు వి ♦ న్నాణెముగను. ౧౪౯

సీ. అనితొల్లికతఁ దెల్పి ♦ యదుగుడంచవి బల్క
మదికోర్కెఁ దెల్పు నె ♦ మ్మదిగనాకు
బుట్టెడుకొమరిత ♦ ముప్వంకలలరిన
కఱివేల్పుతోడఁ జ ♦ క్కనగుననుచు
నుడిగితిరయ్యాయో ♦ పుడమిని దేవర
యెచ్చటఁ బుట్టునిం ♦ కెచట బెరుగు
నెవ్వారెవ్వారిఁ బ్రోచు ♦ నెదిరించుమార్తుర
నెవ్వారిఁ దెగఁజూచు ♦ నవ్వడిగను

గీ. ఎట్టిపున్నెపువానికిఁ ♦ బుట్టఁగలఁడొ
వారివక్కణమంత య ♦ వ్వారిఁగాఁగ
తెలియఁబలుకుము నాయెడఁ ♦ దిరముఁగలుఁగ
కనికరంబార కన్నయ్య ♦ కతనువినెద. ౧౫౦

వ. అని వేడుకొనిన నక్కమలకోమలులకు తపసితనం బిట్లనియె.

క. మీఁవీఁడు జేనికన్నగు
దేవకుఁడను రాజుకూఁతు ♦ దేవకియనఁగా
రావెలఁదుక యందునుకటి
దేవరయుంబుట్టి జగము ♦ తీరికసేయున్. ౧౯౨

వ. అదెట్లంటి రేని నేలపడంతి గోరిన తీరుగ, నేలకేతెంచి వలుగాకి పజలనెల్లఁ దునిమి, నెవరిచే నెవరు బాగుపడవలయునో, చావు నొందవలయునో, అట్టివివరంబులు, నెరవేర్చి వ్రేపల్లెలో నందుని యింటనుండి కాఁగలచెయ్వుల జరుపుచున్నంత కంసుని పంపునయు క్రూరుండనువాఁడు మధురయను ప్రోలికిరా రాచదారిఁ గన్నయ్య యే తెంచి నీకుఁబుట్టుగు నొందు మూఁడువంకలు గలమగుదకు.

ఉ. చక్కఁదనంబు లిచ్చునని ♦ జగ్గెడువక్కఁణమంతఁ దెల్పినన్
జొక్కుచు కోమలుండు తన ♦ జోటికతోరుసి చందమామకున్
మొక్కికరంబుగా సెలువుఁ ♦ బొందినగంబునఁ బ్రోలుచేరియున్
మిక్కుటమైన బుత్తులను ♦ మేలుగనుండిరి నోలలాడుచున్. ౧౯౩

గీ. అనుచు వివరింప ♦ విప్పచ్చు ననుఁగుకొడుకు
కొమరుడిట్లని బల్కె మ ♦ క్కువ చెలంగ
వెన్ననిసుమాళమగు కత ♦ విరివిసేయఁ
దగుదువనరుసి తెల్పె సం ♦ తసముతోడ. ౧౯౪

సీ. ముందుసోకులపాలు ♦ నందిపుట్టిన రాచ
తరటులనెల్లనుఁ ♦ దాల్పలేక
పుడమిబమ్మనుఁ జేరి ♦ యడుగులపై వ్రాలి
తనపాటుదెల్పద ♦ త్తరముతోడ
వేలుపు ముక్కంటి ♦ వేలుపు పెద్దయు
పుడమి చేడియఁగూడి ♦ పోయిపోయి

జోలం బీటలు వేసి యెక్కిపలు మా ♦ జుల్ దియ్యలేక న్వడిన్
గోలందూ టొనరించి దారకుచెయిం ♦ గుత్తించి ద్రావెన్మసన్.

ఉ. వెన్నుడు సేయుసేతలకు ♦ వ్రేఁతలు నోర్వఁగలేక పోయినా
విన్నపమాలకించుమని ♦ వేఁడుచు నీకొమరుండు పెర్గుపా
ల్వెన్నలదక్క నీకయిలు ♦ పీడులదాగి సరానకావలిన్
గన్నెలనుంచి బోవకడ ♦ కన్నెసమాతికిరుద్దిపోయెడున్. ౧౭౪

క. మగనాలి నొకతెఁ జేరియు
మగనికినిన్ దెలుపుతీసు ♦ మగపోడుములున్
దగవివరింపఁగ నాకుం
దగుదువటంచని చెఱుంగుఁ ♦ తమితో లాగెన్. ౧౭౫

క. ఏమనిఁజెప్పుదు మమ్మరో
మామాయిండ్లకును మెట్టి ♦ మసజవ్వనులన్
వేమారు కన్నునన్నల
దామగ పనిసేయుజొచ్చు ♦ పగవెయశోదా. ౧౭౬

ఆ. నాకొమారుడింట ♦ నమ్మి నిద్దురఁబోవ
దూడతోక జుట్టు ♦ తోడగట్టి
కొట్టినంతనీడ్చె ♦ కోయనియుతడేడ్వ
నగుచు చూచెతగవె ♦ తొగలకంటి. ౧౭౭

క. కలవారి కొడుకటంచని
పలువితముల నోర్పుఁ గల్గిఁ ♦ పబలితిమమ్మా
చెలియెట్టులఁ జెప్పెదొబు
ద్దులు పసిపాపండు సేయు ♦ తొడుసులుగావె. ౧౭౮

ఆ. అనుచు దెలిపినవ్రేఁతల ♦ ననిపికొడుకు
నేతలను పాటిబట్టక ♦ చెలఁగి యొక్క

వూటపెరయింటి కేగి యిం ♦ పుగను పెరుగు
ప్రుబ్ధిలించియు దాగెడు ♦ బుడుతఁజూడి ౧౨౯

ఆ. కేలకోలను దూలించి ♦ జాలిమాలి
దుడుకుపనులను జేసితే ♦ దొంగయనుచు
కోలజళిపింప బరుగెత్తి ♦ గుమ్మముదరిఁ
జేరి కంబాలనడుమను ♦ దారుచుండ. ౧౩౦

శా. అమ్మా మ్మెన్నడు నిట్టిచెయ్యులను నే ♦ యంబోనునన్ గొట్టకే
నెమ్మింజూడుము వ్రేతలాడు నుడుగుల్ ♦ నీగుండెయుండామరన్
నమ్మంబోకు మటంచు వేడుకొని వి ♦ న్నాణెంపు గందమ్ములన్
ముమ్మారంబుగ నీరుఁజాఱలలి ♦ మోముం ద్రిప్పి తానేడ్చెనన్.

చ. విడువకయయ్యె శోదచెలి ♦ వెన్నునితో సరిదిగ్గిమోమునన్
బుడిబుడిచేఁ జెమర్పనికఁ ♦ బోయుసికట్టనుఁ జూపిపట్టఁగా
నెడయయి తల్లికిన్నరమ ♦ లెచ్చెనటంచును చేతజిక్కనన్
బుడతని ప్రూకుఱోటికిని ♦ బొట్టకుఁ ద్రాటనుఁ గట్టెఁగట్టెనన్. ౧౩౨

గీ. పోరుతపసితిట్టు ♦ పొందుజక్కుల జేఁ
కొడుకులిరువు రేగి ♦ పుడమిఁ జముల
పొంతజోడు మద్దు ♦ లెంతయునై యున్న
వానికడకుఁ బోయి ♦ వ్రాలెఱోల. ౧౩౩

గీ. రక్కసులు చాలబెట్టెడు ♦ రాపిడికిని
విరివివేఁ వల్లె విడనాడి ♦ బృందయెడు
కానలోఁ జేరిగొల్లలు ♦ కఁడకఁదక్కి
గొలువఁగానుండె సుగములఁ గొనివతారి ౧౩౪

గీ. లేఁగపేరిటి సోకును ♦ లేమిఁ జేసి
కొంగరక్కసుఁజీలిచి ♦ చెంగుమీర

యఘుడ నేఁడు సోఁకుసప్పమై ♦ యలరనోటఁ
జొచ్చిమైఁజీల్చి గొల్లల ♦ జోకమునిచె. ౧౫౫

సీ. జమున పొంతను గొల్ల ♦ చట్టముతోఁ సద్దిఁ
గుడుచుచు దూడల ♦ గుంపులొకఁట
మేయుచునుండఁగ ♦ మిందోవరుల పెద్ద
యే తెంచి లేఁగల ♦ నెత్తుకొనియు
మరుఁగుబడన్ సేయ ♦ మానకకన్నయ్య
దవ్వుగాలేఁగలుఁ దాటెననుచు
మీరలీ సద్దులఁ ♦ మ్రింగుడటంచని
వెతుకఁగా నేగెనా ♦ వెనుక నెమటి

గీ. నలువవిచ్చేసి గొల్లపి ♦ ల్లలనుఁ గవిని
దాచి తనచోటికరిఁగిన ♦ తలనుకట్టి
సకుఁడు వేంచేసి బమ్మమ ♦ చ్చరముఁ దెలిసి
వే్రిఁపిల్లలలేఁగల ♦ వేసమూని. ౧౫౬

క. మేపెడువాడుం దానయి
మేపుచు మలుపుచునుఁ దానె ♦ మేయుచు సిండ్లన్
బాపలు తల్లుల లేఁగలు
జేపెడు నావులనుఁ గలసి ♦ చెలమిగనుండెన్. ౧౫౭

గీ. ఇటుల నాన త్తిఁగలుఁగగ ♦ నింటియుందు
కానయందలి చెరలాఁడఁ ♦ గా మఱిపెఱ
వారిఁగానావులకు గొల్ల ♦ వారలకును
కానుపించకఁ దానెమై ♦ గడిపెనేఁడు. ౧౫౮

ఆ. ఒంటిప్రోఁగొక్క నాఁడు మే ♦ లంటివచ్చి
గొల్లబుడుతల దూఁడల ♦ గుంపులఁగని

తొలిటిరూపులు విడనాఁడి ♦ తుల్లఁదూఁగి
కలిమి చెలితేసిరూపులఁ ♦ గలిఁగెనేమొ. ౧౮౯

గీ. అనుచు కతివేల్పునడుచుచు ♦ న్నంతనలువ
వచ్చి కేర్రివుల ప్రేపసిఁ ♦ బాపలెదుర
మెలఁగఁగాఁగని తనుఁదాచు ♦ మలగవికినిఁ
బోయి నిదురించు క్రేవులఁ ♦ బుడుతలఁగని. ౧౯౦

ఆ. బమ్మగుఱ్ఱిడ్డులోని ♦ పజలనెల్లను నేయు
నట్టినన్నెదిర్చి ♦ యడరులేకఁ
బుట్టఁజేసె గొల్లఁ ♦ బుడుతలఁదూఁడల
నేమిఁజెప్పవలయు ♦ నితనిపగ్గె. ౧౯౧

మ. అని లోలోనఁదలంచుచున్నఁ దలలో ♦ నయ్యారె కన్నయ్యరూ
పునుఁదప్పన్ జగమేమియుం గనకక్రు ♦ బ్బున్గవ్వఁదోడ్తోడ మే
ల్కని నేనెంతటిమోసపోతి జగము ♦ ల్గావింప మన్నింపగ్రి
న్నన పోలింపఁగ మన్నియుండితనినే ♦ నాగెల్చియోడించుటల్.

వ. అని తలంచి యంచనుడిగ్గికేల్ తమ్ములనెదుటఁగీలించి జోహారు
లొనర్చి తనవలన జరిగిననేరంబు సైపుమని యగ్గించి వెండియు.

క. ముమ్మాఱుహజ్జఁ దమ్ముల
నెమ్మది తలబొమిడికంబు ♦ నెలరతనపుడాల్
గ్రమ్మఁగఁ గ్రమొక్కిడి పొగడుచు
నిమ్ములకై యతనియాన ♦ నేగెఁగొని మనన్. ౧౯౨.

వ. వెండియు.

సీ. ఆవుపేరిటి నల్లఁ ♦ దార్రివుఁడుఁ దెగటార్చి
తనయన్నతోఁ బ్రబలం ♦ బునిఁ దునుమఁగ
నేసికాళియుఁ బట్టి ♦ గాసిలఁగావించి
మడుగులో నీటినిమంచిఁచేసి

ఆలమందలు గొల్ల ♦ లార్చుచు కేలోర్మెడ్ప
కార్చిచ్చుమిర్రింగి చో ♦ క్కముఁగఁ గాచి
చెలఁగిరవ్రేతలమేలు ♦ చీరెల ప్రుచ్చిలి
తబసులయిల్లాండ్రు ♦ తగినబగితి

గీ. తెచ్చియిచ్చిన మేల్ బువ్వఁ ♦ దినికడంగు
పెద్దగొల్లలు సురతాణి ♦ పేరజరుపు
జన్నమునుమాన్పిగుట్టక ♦ చ్చంపుబత్తి
జేసివిందులొనర్చినఁ ♦ జేజెతేఁడు. ౧౯౬.

మ. కినుకన్ దొమ్మిదిప్రమ్బులంగలిపి ప ♦ గ్గెన్ బంపవిచ్చేసియు
ల్లనవ్రేపల్లెను బృందకానఁగురియున్ ♦ లావైనరాల్ జల్లులన్
గనిగొల్లల్మొఱవెట్టి కావుమనఁగా ♦ గట్టొక్క కేల్ గోటితో
డనె లేనెత్తివటారివ్రేఁతలనువ్రే ♦ లఁగ్ గల్మొయాల్మందలన్. ౧౯౭

వ. జాకుండ తన నెఱజాణతనంబున వినువీఁడు నాయుం డేడురాతిరి బవళ్ళు వానఁగురిపించిన సుంతైనఁదూలకున్నంత నెవ్వరవడి జల్లుజల్లుననే తెంచి నేలనుఁబ్రోవఁగాఁ బుట్టినముపోకలాఁడుఁగాని మానిసిఁగాడని తెలిసి నజ్జదమ్ములకెరఁగి యగ్గించి యక్కన్నయ్య యానతింగొనిఁ దనటెంకికిన్ జనియె నంత నొక్కనాఁడు తామరపొక్కిలికై పస్తుండు వూట నొరునాడునందుండు జమున జలకంబునందానం బాడుచుండ సందరపుతేని బంటొకండతనింబట్టుకొనిఁబోవఁ కఱివేల్పది విని వాని గొటికికింజని తగిన మన్ననలం జెంది పితరునిందెచ్చె కావున నాప్రోడగాఁతుగొనియాడ నెవరితరం బిదియుంగాక. ౧౯౮

కం. తత్తరములేక వెన్నుఁడు
కత్తెరపున్నమఁజెలంగఁ ♦ గల నెలలోనన్

సత్తువఁగనొక్కరేయిన్
బుత్తిఁగగుంపనెడు సన్నఁ ♦ బొందినకానన్. ౧౯౯

మ. మరుగంజోగుల గుండెదామరలు వే ♦ మాడ్చన్లారింప సం
దరపుంగూఁతురుచన్నుబంతులను ని ♦ ద్దాపుల్కలుంబుట్టఁగ
క్కురమారాల్గరఁగన్ దలిర్పఁ జిగి మొ ♦ క్కల్దీవెలుంజెట్లుతే
సరికెందామరక్రేఁగనుందుగలతె ♦ న్సంజూడ్కిసొంపారఁగన్. ౨౦౦

ఉ. పిల్లనఁగ్రోవిబాడినను ♦ వ్రేచెలులెల్లరు విన్కితోడనే
చల్లనజందమామ వెడఁ ♦ జల్లఁగ రాతిరివచ్చి వల్పుఁజొ
త్తిల్లఁగవ్రట్టువా చనులఁ ♦ దిద్దినకస్తురిగందముంజవా
దెల్లనుమేనునంటచెలు ♦ వెక్కఁగఁగౌఁగిలియిచ్చివెండియున్. ౨౦౧

కం. వ్రేఁతయువెన్నుఁడుమఱియున్
వ్రేఁతయువెన్నుండునిట్లు ♦ వేలకువేలున్
జేతులు బుజముల నిడుకొని
బ్రాఁతిగవ్రట్టువగనిలిచిబాడిఁదిరుఁగుచున్. ౨౦౨

తే. గీ. జోటికలువెన్నుఁడీతెగ ♦ నాటలాడు
పాదనుఁజూడఁగ పదునెని ♦ మిదియుగణుతి
బమ్మవూటలు నొక్కరే ♦ బవలుఁజేసి
పాళిఁజెలువందవ్రేఁతల ♦ ట్లాటలాడ. ౨౦౩

తే. గీ. ఇటులవ్రేతలతోఁగూడి ♦ యించువిల్తు
దురములోఁగలమేరకుఁ ♦ దొంగలించి
పలువితంబులవారితో ♦ జలకములను
వేడ్కనాటాడిబంచెన ♦ వ్వాలఁదులమఱి. ౨౦౪

కం. అబ్బురమగు చెయ్వులత
బ్బిబ్బెమియులేకఁజేసి ♦ ప్రేముడిమందన్

గుబ్బకొనుతల్లిదండ్రుల
నిబ్బరమునుఁజూచి మెదిలె ♦ నిండినవేడ్కన్. ౨౦౫

వ. అంత సంతుకొరకు తోటంజేరిన కమలకోమలులు రుసినానవొంది సుగంబుగా నిల్లుంజేరి. ౨౦౬

క. ఉన్నంత కొన్నినాళ్లకు
క్రొన్ననవిలుకాని రంతు ♦ కొనసాగఁగ మే
లెన్నుచు చెరలాడెడుఁ దల
గ్రన్ననెల మసలెను బయ ♦ కారమెలర్పన్. ౨౦౭

గీ. కొలఁది నడుకలపసఁ దీఱె ♦ కోర్కెలూరె
చిట్టుములు మీఱె, చెక్కుల ♦ చెల్వుఁజాఱె
పెలుచమన్గొరె, మోము వె ♦ ల్వెలుకవాఱె
పొట్టయలరారె చవులనుఁ ♦ బొందగోరె. ౨౦౮

గీ. అసలుఁ బుట్టుగుపైబ్రాలు ♦ మిసిమితేటు
లనఁగ నలుపెక్కె చనుమొన ♦ లలరెఁ జెలికి
దపసి కన్నావవెలుఁగులఁ ♦ దనరుకలువ
యనఁగ పొక్కిలివిప్పె న ♦ య్యతివకంత. ౨౦౯

క. చీటికి మాటికి మన్నన్
బోటికిఁ దినబుద్ధివొడమె ♦ పొటుకున యలఁతల్
వాటిలె నిట్టూర్పెదగెను
నేటుఁగ ముమ్మాసము నెలలు ♦ నిండినయంతన్. ౨౧౦

ఆ. మంచితోయమునను ♦ మగువకు గన్నెక
బుట్టెనమ్మ లక్క ♦ లుట్టిపడఁగ
సంతసంబుతోడ ♦ సలిపిరి పురుటాలి
కి పదిపూటలరుఁగఁ ♦ గేరుచపుడు. ౨౧౧

ఆ. చానలెల్ల జెలికి ♦ సంపెఁగినూనియ
దలకునంటి కమ్మ ♦ నలుగుఁబెట్టి
నీటుఁ గుల్కఁ దావి ♦ నీటిని మజ్జన
మాడఁజేసిరపుడు ♦ పోఁడిమిఁగొని. ౨౧౨

సీ. పుట్టిన కూఁతునుఁ ♦ బోడఁజూచి తండ్రి
ముత్తికిఁ ద్రోవ యీ ♦ ముగుద యనుచు
మువ్వంకలునుఁ గాక ♦ మోము కోమలికము
ముజ్జగంబుల చాల మురువుఁజూపు
ననిపెద్ద సంతోస ♦ మును సందరంబులో
నోలలాడుచు నెడఁ ♦ జాలిమాలి
తలిమీరకుండఁగఁ ♦ దగిన చెయ్వులఁ దీర్చి
బిడ్డచే గలిఁగిన ♦ బిరుదమనుచు

గీ. సాగి నందునిపల్లెలో ♦ చదలుకాపు
లలరఁ బెరుఁగుచు నున్నట్టి ♦ కలిమి నెలఁత
మగఁడు కన్నయ్య యెంతటి ♦ మానిసనుచు
తెలిసి తెలియని యట్లుండె ♦ తెలివిఁ గలిఁగి. ౨౧౩

ఆ. అప్పు డప్పడాలు ♦ నరిసెలు మండెంగ
లట్లు బుబ్బడములు ♦ పిట్లు మణుఁగు
బూలు దోసెలిడ్డె ♦ నాలు నేవెలుగారె
లప్పచులునుఁ బుణుఁగు ♦ లొప్పఁజేసి. ౨౧౪

ఆ. తెలుపుఁగలిగి మిగుల ♦ మిలమిల రాలెడు
బోన మటిఁటికాయె ♦ పొందుపరచి
పులుసు పప్పుకూర ♦ పులుగము త్వేత్వెర
వంట లమరఁజేసి వలఁతుఁలపుడు. ౨౧౫

తే. గీ. గొప్ప మెకములపులుఁగుల ♦ గొత్తెగముల
దెచ్చి వేర్వేరఁదరఁగియు ♦ పచ్చిమెఱచి
లోన మేలేరికఱుకుట్లు ♦ లుసుదలిపర్ణ
బూని సేసిరినిప్పుక ♦ లూని చెలఁగి. ౨౧౬

ఆ. వె. క్రొత్తకుండలందు ♦ కోసినపొలసుల
పులుఁగునంజుడులను ♦ పొందుపరచి
కారముంచినూనెఁ ♦ గట్టాఱికట్టాఱి
పలువితంబులొప్పఁ ♦ బదిలఁబరచి. ౨౧౭

కం. కొంతన్గమ్మనతియ్యన
కొంతన్పుల్లనఁగనేసి ♦ కోర్కెలొదవఁగా
యింతులు మెల్పంతులునే
మంతులఁ గొప్పులను దుఱిని ♦ మదిమదిమీరన్. ౨౧౮

కం. సింగారమలర నెలఁతలు
పొంగలిపాలోగిరంబు ♦ పులిహోగిరమున్
ముంగలనిడి దేవరలకు
పొఁగిజలక మెదుటఁవార్చి ♦ పొదలినబగితిన్. ౨౧౯

కం. ఒకచేకల్లుంగొని వే
రొకచే పొలపంబుఁదీసి ♦ యొకఁడరఁగొనఁగా
సుకము చెలఁగనిచ్చుచు పే
ర్మికలుట్టిపడంగ ♦ ద్రావి మేలనియెదలోన్. ౨౨౦

తే. గీ. ఇంటి తెరవర్లబోనము ♦ మించియున్న
వెట్టినీళ్ళనుచేకొని ♦ వేఁడుకలను
మీరఁద్రావుచు నువ్విళు ♦ లూర పెరసు
లారఁగించిరిలాహిరి ♦ నగ్గలింప. ౨౨౧

కం. కలువందుగలుఁగు గొనములు
నలరారఁగ యానియాని ♦ కలబందుగులున్
పలుమారు రొదలుఁబెట్టెఁడు
తలయాపనులెల్లమాని ♦ తరలిరి మేటుల్. ౧౧౨

సీ. ఒకఁడు పాటలఁబాడి ♦ కొకిబికి వేసంబు
బూని చిందులుఁద్రొక్కు ♦ బుద్ధిమాని
ఒక్కఁడొక్కనిబట్టి ♦ చక్కఁగఁగౌఁగిట
నొత్తికల్ద్రావించి ♦ నొదుగ నేయు
యొకసక్కెమాడుచు ♦ నొకఁడు చియ్యానునోట
బెట్టిలేదని కేలు ♦ వేయుచుండు
తనచాయదనయట్లఁ ♦ దనరతిగ్గాడిన
బట్టఁబోయితురీనఁ ♦ బకునొకండు.

తే. గీ. యిటులక్కైపునువేవట ♦ యెసకరింప
మేనులూఁగఁగనడుకల ♦ మిసిమిఁదొలఁగ
నెఱులురేగగ కన్నుల ♦ యెఱుపులెదుఁగ
పవ్వళించిరి బడలికఁ ♦ బడి తలంప. ౧౧౩

కం. ఇంతులరతనములందఱి
బంతులుసాగించి బువ్వ ♦ పళ్ళెరములలో
సంతుగబెట్టిన మెసవిరి
పంతుగమిత్తులునుతోడి ♦ బందుగులుపజల్. ౧౧౪

ఆ. వె. వెలఁది కూఁతుకొరకు విందులుఁగావించి
మిసిమిగొలుసులలరు పసిఁడితొట్లె
గట్టిబిడ్డనుంచి ♦ బెట్టుఁగచెలులంత
జోలబాడిరచట ♦ మేలుమీర. ౧౧౫

ఆ. పెద్దలంతఁగూడి ♦ పేరిమిఁదళుకొత్త
పెలుచకుబ్జయనేఁడు ♦ పేరుఁబెట్టి
రేఁటఁబెరుగుపాప ♦ బూటఁబెంచిరిపది
యారుగణుతియేఁడు ♦ లరుగునంత. ౧౨౬

తే. గీ. అప్పుడప్పుడు తలిదండ్రు ♦ లబ్బురంపు
నేతలనుసేయు కన్నయ్య ♦ చెన్నులెన్ని
మాకొమార్తెకు మగఁడైన ♦ మంచిదనుచు
బలుకముసిముసి నగవులు ♦ పడఁతినవ్వ. ౧౨౭

తే. గీ. పుట్టినదిగోలెదురుసుల ♦ పోవడములు
లేకకన్నియలనుఁగూడి ♦ వీఁకనాట
పాటలనుబ్రొద్దుబుచ్చుచు ♦ పలుకువలన
కన్నయగొనాలనెల్ల చ ♦ క్కవనిఁదెల్పు. ౧౨౮

ఉ. మందయశోదయింటికిని ♦ మాటికిమాటికివచ్చి పోవువా
రందఱు నల్లమేనిదొర ♦ యబ్బురమాకతలెల్లఁ జెప్పఁగా
విందుగవీనులన్వినుచు ♦ వేడుకఁజెందుచు మైగగుర్పఁగా
నందయశోదలేమిటి నొ♦నర్చిరొ బాగెముగల్గుచెయ్వులన్. ౧౨౯

వ. ఇట్లు మధుర యను పట్నంబున డెందంబుకొందలబడనీక నంద కొమారుని యడుగుదమ్ములకై జోహారుసలుపుచు కన్నులఁ గన్పడు బాగెంబునకై యెదిరి సూచుచు కంసునిరాణికి పూట పూటకు తావిగలగందంబులిచ్చి వచ్చుచుండెనట. ౧౩౦

క. దుగినుని బసనుండియు ము
జ్జగముల మేలరయఁదలఁచి ♦ సయ్యనవచ్చెన్
జగడాల తిండిరుసిరా
జాగిసేలకు నొక్కనాడు ♦ హాయలుఁ జెలంగన్. ౧౩౧

సీ. మునుమున్నె మథురకుఁ ♦ జను దెంచి కంసుని
చే గారమునుఁ జెంది ♦ చెప్పెనప్పు
డేకతంబుననుండి ♦ యీావుల మొదవుకు
సరిఁదూఁగు మొదవుల ♦ చాలువ్రేలు
తలఁపనందుడుయశో ♦ దయు రోహిణియు వసు
దేవుఁడు దేవకి ♦ తెగయదువులు
మొదలుఁ గాఁగలవారు ♦ చదలు కాపులుఁగాని
మానుసులునుఁగారు ♦ మఱియుఁదొల్లి

గీ. కాలనేమివినీవును ♦ గానపుడమి
గావబుట్టిన కఱివేల్పు ♦ గాని కట్టి
చెలియు చెడుపులుఁజేసిన ♦ చెనఁటిపజను
జంపిపాడిని నిలుపు నీ ♦ జగమునందు ౨౩౨

సీ. మిన్నుబల్కిన పల్కు ♦ లెన్ని బీతునుఁజెంది
పసికూనలనుఁ ♦ జంపపట్నములకు
పల్లెలకీవంపు ♦ బలగము నందఱి
వ్రేపల్లెలోనున్న ♦ వెన్నుఁడకట
తెంపరియైఁ జంపె ♦ దెలియదు నీకది
యనిరుసి చందురు ♦ డరిగెనంత
దేవకి కడుపునఁ ♦ జేవఁగా బుట్టిన
కొడుకుల నార్వురఁ ♦ గూల్చి పిదప

గీ. చెలియలినిఁ బావఁదలిఁదండ్రిఁ ♦ జెరనుబెట్టి
కువలయాపీడమను నేనుఁ ♦ గును నెదురను
ముష్టికునరిష్టు చాణూరు ♦ మొదలుఁగలుఁగు
బిరుదులను రచ్చలోనిల్పి ♦ బెట్టుచెడక. ౨౩౩

గీ. ఎల్లగొల్లలు విచ్చేయ ♦ విల్లుసన్న
జన్నమును సేయు నెపమును ♦ బన్ని చెలులు
మంతురులుఁ దానుతలపోసి ♦ మందనున్న
వారిరప్పింపఁ దలఁచె న ♦ క్రూరుచేత. ౧౩౪

సీ. కంసునియానచే ♦ కదలి యక్రూరుండు
వ్రేపల్లెకేగిన ♦ వేడ్కనొంది
నలమేని దొరయు మ ♦ న్ననసేయ హరుసించి
తనరాకఁ దెలుప నం ♦ దయునుఁగూడి
విలుసన్న జన్నము ♦ వేఁడుకఁజూడగ
పన్నుఁగ నన్నతో ♦ బయనమైన
తరువాతి నందుండు ♦ తగుపెద్దగొల్లలు
మిసిమి పాల్పెరుగులు ♦ మేల్దినుసులు

గీ. మొదలుగాగల కాన్కల ♦ మొనరిరాగ
మధురకేతెంచు తెరువులో ♦ మరునిగన్న
తండ్రిచూపించె తొల్లింటి ♦ తనదురూపు
బగిలితోఁజూచె నక్రూరు ♦ డొగిజమునను. ౧౩౫

ఉ. ఎప్పటియట్ల కన్పడిన ♦ యేలికవెన్నునిజూచి తేరుపై
జప్పన నెక్కి వేనడచిసొరగు ♦ పట్నముఁ జేరెతోఁటలో
జప్పరమందు నిల్చియు బ ♦ జారున రానొకచాకివల్వలుఁ
గొప్పరమందు నుండఁ దల ♦ గొట్టి వళావళిఁదాల్చి రొప్పుగన్.

వ. అంత బోయిపోయి. ౧౩౬

ఆ. సొగులిచ్చువాని ♦ చోటుకు వేంచేసి
వాడొసంగు సరులు ♦ వరుసదాల్చి
కలుములిచ్చివాని ♦ కలకును విడనాడి
త్రోవవచ్చుచుండ ♦ తొట్రుపడుచు. ౧౩౭

క. ఆతీరుఁ దారినడుచుచు
పూఁతకునై గందముఁగొని ♦ మువ్వంకలచే
నాతుకకుబ్జయు రాఁగై
నేతలకాకోరఁ గొనఁగ ♦ చిక్కనివేడ్కన్. ౨౩౯

గీ. కఱ్ఱిమనుమడ నేనేమి ♦ కతలుఁజెప్పు
దచటి కెడురేగె మువ్వంక ♦ లలరుచున్న
గుజ్జునా చెలిగందపుఁ ♦ గొనియొడయుని
కియ్యఁగా బోవగనివెన్నుఁ ♦ డిట్టులనియె. ౨౪౦

ఉ. ఎవ్వరిదానవీవు కుల ♦ మెయ్యది నీకిడుపేరదేమొ కో
యివ్వలపున్న గందముల ♦ నెవ్వరికియ్యఁగ నేగుదానవో
నవ్వడిదెల్పుమన్న హరు ♦ సంబున దెల్పెను రాచతైన మీ
మవ్వపుసుద్దికిం బదులు ♦ మాటనుఁ జెప్పఁగ నెంతదాననో. ౨౪౧

సీ. ఐనఁ దెల్పెదమీర ♦ లాలించు డాగికంసు
వరవుడ నల్లని ♦ వన్నెఁజేజె
హాజ్జదమ్ముమ్మలఁ బుట్టు ♦ వందినవారిమేల్
కొలము మాయదిపేరు ♦ గుబ్జయండ్రు
పన్నీరుజవ్వాది ♦ బల్తావికస్తురి
గందముగల కోర ♦ లందియెపుడు
దేవేరికిచ్చెద ♦ దేవరకొనియెడు
తలఁపున్న చేపట్టఁ ♦ దగుదురహహ

గీ. తొల్లి మేనునఁ నేజేయు ♦ దురుసుపనుల
దోసమెల్లను నిన్ను కం ♦ దోయిచేత
జూచినంతనె సమసెని ♦ చ్చోటకలప
మొదలఁబూయుము సకులతో ♦ హెచ్చరికను. ౧౪౨

గీ. అనిబలికి గంధమిచ్చి యొ ♦ య్యారి కేలు
మొగిచినిలిచిన చిన్నెగు ♦ లెగయ మొగము
నిగనిగలు వారికలవము ♦ నెమ్మికాంద్రు
జూడచేకొని బలికె మె ♦ చ్చుగను చెలికి. ౨౮౩

ఉ. పాయమునందు నీకుగల ♦ వంకర ముప్పిరివోవునట్లుగా
మేయినిఁ జక్కఁజేయుదని ♦ మేల్కడకంటి వటారిచూపులన్
బాయకఁజూచి చిత్తరము ♦ బాహిరమై వెలుగొందబోరపై
బూయుచు నన్నయుం జెలులు ♦ బూయగనిచ్చెను బూసిరందఱున్

గీ. పూసియక్కటికముఁ బూని ♦ పొలఁతిచెక్కు
క్రిందనొక కేలు హజ్జల ♦ యందుహజ్జ
లుంచి యెగఁదీయ చద ♦ లున మించునల్ల
ప్రబ్బులో మెర్పుదీఁగకు ♦ మాద్రిబోలి ౨౮౪

తే. గీ. రంగుమీరంగ పొంగారి ♦ రాణయెనఁగఁ
మంతనంబున వలపోత ♦ కొంతఁజేసి
చెలియొయారపుఁ జూపుల ♦ చెలిమి వెన్న
దొంగపైఁ గలపసిఁడిచె ♦ ఱంగుబట్టి. ౨౮౫

ఉ. వాలుగడాలు క్రొన్ననల ♦ వాలునకుం జెలిజంకునొంది కాం
తాళము,బూని నేర్పుఁగల ♦ తట్టసమాటల నల్లవేల్పుతో
మాలిమిఁ బుట్టనిల్లనియె ♦ మన్ననసేయు మురంతులోన నీ
జాలము మానుమన్న నగి ♦ చామనమై దొరబల్కె వెండియున్.

క. కనుసన్న నన్నఁజూపుచు
వినుమా చెలిమేమువచ్చు ♦ వీటిపనులు దీ
రినమీాద నీదుకోరిక
లనుఁ దీర్చెదనింక నీకఁ ♦ లకునకుఁ జనుమా. ౨౮౬

క. అనివలుక సమ్మతించి మ
రునిఁగన్నయ యచోటువాయ ♦ రోకులుఁ దొలఁగన్
గనుఁబొలఁతి మానికంబును
తనయిల్లునుఁజేర జనియె ♦ తాలిమిగదురన్. ౨౮౯

తే. గీ. అనినిరాబారి చందురు ♦ డానతీయ
విని పరిక్షిత్తుఁడనురాజు ♦ వెన్నదొంగ
కతను జానుగులలరగ ♦ కఱదలోన
హరుస మిగురొత్త వెండితా ♦ ననియె బెలుచ. ౨౯౦

ఆ. వెన్నుఁడేగినంత ♦ వెలఁది కోరినయట్లు
కుబ్జమేడఁజేరి ♦ గొనెనొసుగము
దెలియఁ జెప్పుడయ్య ♦ తేటతెల్లంబుగ
వినెద యెసకమెసఁగ ♦ వీనులలర. ౨౯౧

(కలహంసోత్సాహవృత్తం)

విసపుతిండి తగరుకాతు ♦ వెనుకతేమ నెత్తులం
దెసగు బొమ్మడికపు రవ్వ ♦ లెనయు తేజులొప్పగన్
ముసరిహజ్జదు గలఁగేు ♦ ముడిచి మ్రొక్కి వేడగా
కసటుఁబాసి యలరసేయు ♦ కఱియమేని వేలుపా. ౨౯౨

(తరళవృత్తము)

వసిఁడిసాలువ సెల్లసంద్రుని ♦ పట్టినట్టిద నీటియి
క్కసరిపేరులు రొమ్మునంగుడి ♦ కైన దాపటికేలునం
దెసఁగు సంకునుబిల్లు వాల్గొని ♦ హెచ్చిపుల్గు హమూయిపై
నసిఁగనెక్కి వయాళిసల్పిన ♦ సామిమేల్మలదాలుపా. ౨౯౩

( గద్య. )

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల తంయాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతం
బైన అచ్చ తెనుగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ప్రథ
మాశ్వా
సము

శ్రీ







శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రంహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః||

# అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసము

( ద్వితీయాశ్వాసము )

క. సిరిచెలిమెద కలపముతో
    గరగరిక న్మొసలివ్రాసి ♦ గవురుసిర మొనా
    మెరమెరఁ గలుఁగగ మలిపిన
    మరునికి మరుఁడవగు వేల్పు ♦ ములనరసింగా.
వ. ఆలకింపుము. ౧

తే. గీ. నావిని వలంతిరుసిజేని ♦ తోవెలంది
    ముచ్చటలఁ దెల్పివినుమని ♦ మురిపెములర
    నట్లు నలమేని దొరతోడి ♦ యాననొంది
    చనితనదు తావునకుఁ జేరె ♦ సంతసమున. ౩

తే. గీ. తవరకన్నయ్య చేతముట్టడము వలన
    వంకరలుఁబోయి మంచిమ ♦ వ్వంపుతనము
    నొందె నావలపూట పూ ♦ టందరువుగ
    మమ్మరించెను జవ్వన ♦ మెమ్మెతనము. ౪

క. ఆజవ్వన మంతంతకు
తేజుఁగలిగిఁ వంతటికిని ♦ తేరినదా నా
హాజవ్వని ముజ్జగముల
తాజుగలుఁగువారి కనులఁ ♦ దగపండువయెన్. ౫

క. దాని మెఱుంగుల యొడలున్
దాని యొయారంపునడలు ♦ తళ్కుగు తొడలున్
దాని నునుకురుల చకచక
లానలువయు గణుతిసేయ ♦ నలవియె దలఁపన్. ౬

ఉ. రంగుమెఱుంగు నిద్దపుహొ ♦ రంగును మీరెడువాలుఁగంటిలే
మింగల కౌనుఁగాంచిమెద ♦ మిక్కిలి నివ్వెఱగంది జంకునన్
సింగము సత్తినింగొలిచి ♦ చేవగలంపగ వచ్చిచూచి గ
ల్వంగడఁ గానకే చలిమ ♦ లంగవిఁదూరెను నాటనుండియున్. ౭

ఉ. కన్నెకమోము చందురు ప ♦ గంగొన చీకటిగాము యెంచి తా
చెన్నగ చన్నగట్టులనుఁ ♦ జేరిన నందగలేకఁ గ్రక్కునన్
వెన్నన కేగెనో యనఁగ ♦ వేడుకమీరఁగ వాలుగంటికిన్
పన్నగ కీలుగంటుగను ♦ పట్టెను కన్నులపండువౌ లలిన్. ౮

సీ. కమ్మదనంబగు ♦ నిమ్మపండులఁజూచి
కత్తికోతలపాలు ♦ గాఁగఁజేయు
గన్నెరుగుత్తుల ♦ చెన్నువఁదొలఁగించి
పెల్లున గోరులఁ ♦ గిల్లఁజేయు
తఱిమల పెంపొందు ♦ తరివేల్పు వేలుపు
దాయలచేతులోఁ ♦ దరుఁగనేయు
జక్కవపక్కలు ♦ నిక్కనఁ గనుగొని
జోడువిప్పఁగనేయు ♦ వేడుకలర

గీ. ఇటులనుఁబ్బును మెలిమి ♦ కటికెతనము
చక్కఁదనమగు వ్రటువ ♦ నిక్కుచున్న
ననలుఁ బుట్టుఁగు మె ♦ ల్కంటి మిసిమిగుబ్బ
లలరె సింగార మెల్లనుఁ ♦ జిలకరింప. ౯

క. మీలాకన్నుంగవన
ద్దాలా చెక్కిళ్లు విలువి ♦ తాలా బొమ్మల్
లాలావాతెఱ మసమగ
జాలాపలువరుస మరుగు ♦ జాలా పల్కుల్. ౧౦

క. చెందొవల దూరుకన్నులు
కెందమ్ములఁ గ్రేణిసేయు ♦ గేరెడడుగులున్
చందురు బురణించెడు మో
మందముగల చెలినిఁజూడ ♦ నబ్బురమయ్యెన్. ౧౧

క. విండ్లాబొమ్మలు తమ్ముల
తూండ్లా కేల్ దోయిమిసిమి ♦ తోరం బగు పూ
చెండ్లా గుబ్బలు మెత్తని
జిండ్లా లలి పిరుదులలగు ♦ తెఱవకుఁ దలఁపన్. ౧౨

క. తమ్ములు కన్గవవన మొ
త్తమ్ములు మైతావిరాము ♦ తమ్ములు నుడులం
దమ్ములు మేన్మెఱుఁగులు గు
త్తమ్ములు చన్నుంగడి పరి ♦ తమ్ములు సొరముల్. ౧౩

ఉ. నెలసరిఁదూఁగు మోములలి ♦ నించిన కన్గవనిండు పండువె
న్నెలఁ సరిఁదూఁగు చిర్నగవు ♦ నీటగు నాచనుబోలు పెన్నెరుల్
నెలసరిఁదూఁగు మైవలపు ♦ నిగ్గనిగారపు బంగరంపు వ
న్నెల సరిఁదూఁగు మైమెఱుఁగు ♦ నెల్తుకమిన్నకుఁజూడ నబ్రమై.

చ. చిలుకలనంచ తుమ్మెదల ♦ చిన్నెలడంచు మడంతిసుద్దులున్
గులుకు నడల్ పొడల్ సొబగు ♦ కోల్కొన వాతెఱహజ్జబుంగనుల్
చెలఁగిన మేనుతావి లలిఁ ♦ జిక్కిన వేనలిముక్కు సొంపులున్
గలిగిజగానఁ దీనిసరిఁ ♦ గానమటంచు పొగడ్తకెక్కెనా. ౧౫

చ. వలదొరబొడ్డు కేళకుళి ♦ చాటుచు మోమునుమామఁ జూడఁగా
దలఁచియు నుర్కులందడలు ♦ దాటఁగలేకయె చాచిగట్టులం
గలుపఁగ పిల్లవంతెనను ♦ గట్టిన చాలనిగట్టినట్లు పొ
క్కిలి చనులంటియూరు వెలి ♦ గెఱ లలిమీరఁగ కల్వకంటికిన్.

సీ. నవవిల్తుచే ముల్కు ♦ లను వగునఱఁటుల
కడువడిరా కొట్టు ♦ పొడలు దొడలు
కుందనపుం డళ ♦ కుల తెలిపిట్టల
కడరుఁ బుట్టించెడు ♦ నొడలునడలు
చిప్పఁదాల్చినవానిఁ ♦ జప్పమొల్చిన వాని
నీళ్లలో ముంచుమీా ♦ గాళ్లుగోళ్లు
పులుకాసి పులుఁగులఁ ♦ బొలుపు కెందమ్మిల
బిడియము నొందించు ♦ నుడుగులడుగు

గీ. లనుఁగుచేపల మలమించు ♦ కనులు చనులు
మించుసంకును బ్రుబ్బుచు ♦ మెడయు జడయు
పొలుపు సంపెగియద్దముల్ ♦ ముక్కుచెక్కు
లనఁగ వెలఁదికి పెంపొందె ♦ నౌరబళిర. ౧౭

క. డాలాపిక్కలు కొంబవ
డాలాకెమోవి తమ్మి ! డాలా యద్దుల్
వాలా చూడ్కులునునుసవ
రాలా జడతీవి బొంగ ♦ రాలా చన్నుల్. ౧౮

సీ. కానరానడుగుల ♦ కానిబొమ్ముల నంద
గాఁజేయఁగాఁ జాలు ♦ కలికియూరు
నీటిపుట్టుఁగు నెప్డు ♦ నీటిఁబుట్టఁగ సేయు
కొమరారు సొగసైన ♦ కుతికెతీరు
పల్ గొమ్ముమొకముల ♦ బల్సిగ్గు నొందించు
నవలమెల్ రతనంపు ♦ నడలజారు
పదియూరుఁ వన్నెల ♦ బంగారు నిప్పుల
నుడికింపగాఁ జేయు ♦ నొడలసౌరు

గీ. పువ్వముల విల్లుచేపట్టు ♦ పోటుకాని
కిగలవాలును మించున ♦ మ్మొగునచూపు
లలరుఁ కెందమ్ములను ప్రక్క ♦ లలరసేయు
కన్నుఁగవయొప్పె కలికికి ♦ చెన్నుమీర. ౧౯

చ. అవగడమంది లచ్చిచొఅహా యని ♦ బీఁతునుమిత్తి గొంగకై
దవులఁగ యామిటారి మొలఁ ♦ దాగిన మంతిరి తేరుదండు నా
రివిలుల కొనలుం బెడవి ♦ రెప్పవు సుద్దిసౌరంబు ముంగురుల్
దవులుఁగ బొమ్మచూడ్కుల వి ♦ తంబఁఱునం గొనబెట్టిదమ్ములన్

సీ. అచ్చెలిమేల్మేలు ♦ పొచ్చపుకొనెంచి
తెఱవాయి మొకములుఁ ♦ బొఱియదూఱ
కల్కిపల్కుల కుల్కి ♦ పిల్కచిల్కల పౌజు
లాటతోటల ప్రమాకు ♦ లలరఁబాఱ
యక్కల్కి కెక్కుడై ♦ నిక్కునారిదలంచి
నెట్టనసప్పుడు ♦ ల్బుట్టఁజేరె
కడువడి చేడియ ♦ నడలకు నెడఁగాక
యంచల నొడలు తె ♦ ల్పాయె నేల

గీ. సంపెగింపు పరిఢ ♦ వింపనౌ ముక్కుఁను
కెంపు సొంపు పెంపు ♦ నొంపుమోవి
మెఱుపు నొఱపు సేయ ♦ బఱపెడు నెమ్మేను
చందమామ యంద ♦ మొందు మొగము. ౨౧

ఆ. తూలమేలుఁ దూలఁ ♦ జాలుకన్గవతమ్మి
పూలఁబోలు కేలు ♦ మేఱుచీఁకు
వాలుకీలుగంటు ♦ లాలుఁ దేలిన మోవి
డాలుపూలగు దెల ♦ నేలుచనులు ౨౨

సీ. తమ్మిలు వ్రక్కలై ♦ తళుకుఁబోవిడెతలల్
పొట్టలఁ దాబేళ్ళు ♦ బెట్టుకొనియె
అఱఁటులు గొడ్డంటి ♦ నఱుకుల్లఁ బడిపోయె
సింగముల్ గవులలో ♦ జేరిడాగె
పసిఁడిచెంబులు నీట ♦ బల్మారు మునిఁగెను
తావిమంకెన విడి ♦ తఱుచువాడె
కెంపుకంటులు కానఁ ♦ గేరుకొమ్మలఁ జేరె
సప్పము ల్వెసపావ ♦ జగముఁ జొచ్చె

గీ. హజ్జదుగలకు మీఁగాళ్ల ♦ కలయుతొడల
కరయ నడుమునకును చను ♦ లలరుటకును
కీలుగంటు సొరంబునుఁ ♦ గేరుమోవి
కెలమినోటమి జెందుచు ♦ లలిదొరంగి. ౨౩

చ. చిలుకలు నప్పము ల్మెఱుపు ♦ చేపలు నచ్చెలిపల్కు కీలుగం
టులలిని మేనుకన్నులు పొ ♦ టుక్కునఁ గన్గొని గెల్పులేకకొం
మ్మల వెనఁజేరె ♦ బుట్టలను ♦ మాళము మైగొని దూటెబైలునన్
వలనుల మీఁరెపెచ్చు గరు ♦ వంబును బోవిడి నీటఁ బారెనౌ. ౨౪

సీ. చిన్నిచీమలఁబారు ♦ చెలిమిన్న నూగారు
మోముచెల్వును మీరు ♦ మోముదారు
తాబేళ్లు మీగాళ్లు ♦ తళుకుచుక్కలు గోళ్లు
నెఱకలడాళ్లు వ ♦ న్నియనెమళ్లు
పదియారువన్నెల ♦ బంగారుమై తీరు
కారుసవ్వము జడ ♦ సౌరుగేరు
పలుచాలు ము త్తియం ♦ బులబారు బోదూఱు
పిల్కచిల్కలపల్కు ♦ కల్కిపల్కు

గీ. కమ్మనగుతావి మైఠీవి ♦ కావిమోవి
కళ్కుతమ్ములఁ గలహోయి ♦ కన్నుదోయి
నూవుబువ్వుముక్కు నద్దంపు ♦ రేవచెక్కు
లలరు నన చెండ్లు పాలిండ్లు ♦ చెలువకలరు. ౭౫

ఉ. తమ్ములదాయ తేజు తెలి ♦ దమ్ములబాజు తళుక్కుమించుట
ద్దమ్మురువాణమున్ గలిపి ♦ తగ్గని నిగ్గునుఁదీసి బమ్మతా
నెమ్మనివేల్పు జవ్వనుల ♦ నివ్వటిలంగను సేయునట్టులీ
కొమ్మ మొగంబెలర్పమఱి ♦ కోల్కొనె చెక్కిలి కన్నులున్నగుల్. ౭౬

క. ఇట్లా చెలికఱివేలుపు
మాట్లాడిన మాటలకును ♦ మల్లిఁడిగొని తా
కట్లు విరివిల్తుఁ డొసఁగఁగ
చాట్లకు వెఱగంది మేడ ♦ చక్కికి జేరెన్. ౭౭

క. అట్టితరుణమున ననకా
రుట్టిపడెఁ మగలఁజెలుల ♦ హాయలకు బలుకుం
బిట్టలకును రా తెలినెఱి
పిట్టలకుం గోయిలలకు ♦ పేరిమిఁబుట్టన్. ౭౮

తే. గీ. వరలు తరియనుచిత్తారు ♦ వ్రాయువాఁడు
విరిహాదనుఁజేని కెదలోన ♦ వేడ్కఁబుట్ట
కెంపురాల్గూర్చి కొలువున ♦ కేరికాన్క
బెట్టెనోయనఁ జిగిరించెఁ ♦ జెట్టులెల్ల. ౨౯

సీ. కొండాట మెదఁగల్ల ♦ గోరువంకలగమి
వంగడంబుల పగ్గె ♦ వరుసదెలుప
చిగురాకు మేపరి తో ♦ గల కోలలవారు
సొరదిముందర బరా ♦ బరులు నడువ
పులుకాసిపులుఁగుల ♦ పొదులు దండితనంబు
కుత్తుకలెత్తుచు ♦ కొసరుచుండ
కొదమతుమ్మెద గాణ ♦ లెదనసలారంగ
పసగలపాటలు ♦ బాడుచుండ

గీ. యంచపులుఁగులు చెలరేగి ♦ యాటలాడ
తివియలను కొమలుమీరతు ♦ ల్దెచ్చిపట్ట
గాలిపడిగాపు వెంబడి ♦ రాలలిఁగను
వచ్చెననకారు కందువ ♦ పాదుసాహి. ౩౦

ఉ. తాలిమిపూల కారనేఁడు ♦ దాది సరాసరి మారువాణమా
పాలడలందు తియ్యనగు ♦ పాలనుఁగూర్చిన యుగ్గునింపి మే
ల్మేలని తేటిపిల్లలకు ♦ మేకొనివచ్చె ననంగకమ్మనీ
ర్వాలెము నిండిపూవుగమి ♦ బాగుగబూచెను తీఁగెలన్మసన్. ౩౧

క. చిగురులచే నాకులచే
మొగడలచే పలు వితాల ♦ పువ్వులచే చెం
గుగ కాయలపండులచే
దగవెలిగెన్ నిండువిరిహా ♦ దను మేల్మేలై. ౩౨

తే. గీ. అంత నట్టింటిలోఁగడ ♦ నందములర
పడుకగదిలోన బంగారు ♦ పనిచెలఁగిన
గొలుసు తొట్టియుపై పూల ♦ కుదురుఁబరచు
పాన్పుఁ గనుఁగొని పైకెక్కి ♦ పవ్వళించి. 33

క. నిట్టూర్పులు నిగుడఁగనొక
డిట్టరిఁ గనులారఁజూచి ♦ తిమ్మనలేకే
రట్టడిదేవర నేమని
దిట్టుదునిప్పుడొర చాము ♦ దేవర బొప్పెన్. 3౪

క. పిమ్మటను హెచ్చరించియు
కమ్మని విలుకాఁడుత్రుళ్లి ♦ గరకటితేకే
తమ్మిమొలుకులను నెదపై
గ్రుమ్మెననుం సొమ్మసిలఁగ ♦ కువ్వాడముతో. 3౫

ఉ. బెగ్గిలిబేలనై తినిఁక ♦ బేసిలకోరుల కానితండ్రిమై
నిగ్గులు నాదుకన్నుఁగవ ♦ నిల్చెను చక్కెరబొమ్మ యింకనీ
పగ్గెను వానికేదొక నె ♦ పంబిడి నాదగుచెంతఁ జేర్చినన్
నిగ్గదలేకపోయినను ♦ నిచ్చయుచిచ్చట మోసపోవుటల్. 3౬

క. అనిఁ బొరలుచు మైమరచుచు
వినుఁజూచుచుఁ దెసలనెల్ల ♦ వెత్తిఁగఁ గనుచున్
ననవిల్తునిఁ దూఱుచుఁ గ్రొ
న్ననబోఁడి వితాకునొంది ♦ ననతను మునిఁగెన్. 3౭

తే. గీ. ఇటుల దమకంబుఁ గొనియెడ్డ ♦ కటకటపడి
మైమరచియున్న చెలియను ♦ మగువలెల్ల
చూచి చలువపనుల్లేసి ♦ సొద్దైమైన
మాటలనుఁ జెప్పిరప్పుడు ♦ మంచిగలుఁగ. 3౮

క. ఓనవల యీ విరాళిం
బూనికుమారిల్లుచుండి ♦ పుయిలోటమిచే
నానఁగొని మాకు నీవ
క్కాణము వినుపింపకిట్టి ♦ కటికము మేలే ౩౯

క. తగునటవె తామరాకున
మిగులన్విసమెల్ల గ్రమ్మ ♦ మేకరివీవన్
దగులక కదలినవై పున ౪౦
మగువామాకఱఁ దలదరె ♦ మలికిత మొప్పన్.

తే. గీ. అయిన యిటువంటి పసులెద ♦ నానుకొన్న
హదనుఁగోలెను ప్రొద్దెగ ♦ హాయిమీర
వరలు వోమనగుంటలు ♦ వలపుఁదీర
నెత్తములనాడ బాగగు ♦ బిత్తరమున. ౪౧

క. చెలియేరికి కళవలమెన
గలిఁగిన తోయమున చెల్మి ♦ క్రొల్గంటులతో
మెలఁతోఁటలోనఁ ద్రిమ్మరు
టలలిచెలఁగునమ్మ నక్క ♦ టాబోద మొగిన్. ౪౨

క. అనుచు నొయ్యారికి నుడివిన
వినితీఁగ మెలుంగుతోడ ♦ వెలఁదియొడలి నె
ల్లనెగాదిగఁ జూచుచు వా
కొనె బంగరుబొమయు మరుని ♦ కోమయగు కోమయున్. ౪౩

క. ననఁబోఁడి నీమదింగల
పనిసేయుమటన్న చెల్మి ♦ పడఁతుక వేగన్
పనికత్తెల హెగ్గడిక
త్తెను బంపితలంపులెల్లఁ ♦ దెలివిడి సేయన్. ౪౪

తిమ్మఁగల్గి చూడకె చలి తీవెగుంపు చెంగటన్
కొమ్మలోటు లేక మొగలఁగూడియుండ్రి నర్మిలిన్. ౫౬

కం. పూవుల కమ్మని తావులు
తావుల సొగసైన యొట్టిఁ ♦ దనమగు మావుల్
మావుల సొంపగు తీవెలు
తీవెలఁగడు బ్రిదిలినవలు ♦ తీరగు కోవుల్. ౫౭

చం. నెలఁతుకలెల్లరా మొగము ♦ నీటగుదమ్ములఁజూచి తుమ్మెదల్
వలచి తురీనవచ్చి చెలు ♦ వంబున మబాకొని కమ్మనీటికై
మొలఁగుచుముక్కుగాంచియుత ♦ మిన్గొని సంపెగయంచు సారెకున్
నలకువఁజెంది జంకులెద ♦ నాటఁగ ద్రిమ్మరిలెన్వెలందుకా. ౫౮

కం. ఈరమణముద్దరాలికి
నారెము నంగలుఁగువింత ♦ లరసములొలుకన్
గారవినిఁ జెప్పనువ్విళు
లూరఁగ నొకరొకరుఁగూడి ♦ సువిదెవినంగన్. ౫౯

తే. గీ. ఒక్కమడఁతుకపారుసంబు ♦ పిక్కటిలఁగ
కేకినలుఁగొట్టి పూపొద ♦ రోతుఁజూపు
వ్రేలఁజూపుచు సయ్యాట ♦ వ్రాలి చిలుక
పిల్కపల్కను బల్కెను కుల్కులొల్క. ౬౦

ఉ. పుష్పొడి దీవులున్ ననుచు ♦ పూవుల తావులు విచ్చుకోవులున్
గుప్పనిమావులున్ గమియు ♦ కొమ్మల రేవులుఁగల్గుచున్నవో
పుప్పొఁబోణులార చెలువుం ♦ గల నీయెలఁదోఁటలో ననీ
టొప్పఁగ నాటలాడుటకు ♦ నొప్పను సోమదొలంగు నర్మిలిన్. ౬౧

కం. అని వాక్రుచ్చిన చేడియ
విని మదిలో బాళిఁజెలఁగ ♦ వీఁకను నొకక్రో

న్న నఁబోఁడి బుజముపై చే
తిని వేసి యొయ్యార మొదవ ♦ తిరుఁగఁగఁ జనియెన్. ౬౨

చం. చనికనె బొమ్మరిండ్లు హారు ♦ సంబున లేపెనుబట్టి కాంౘ్రతెం
చెనుమనతమ్మితూండ్లు పసఁ ♦ జెందఁగఁగట్టెను పూలచెండ్లు నె
మ్మని దినుకమ్మపండ్లు కలి ♦ మింగనుగోసెను గుత్తిదండ్లనా
డెనట పసిండిగిండ్లలిఁ ♦ డీకొనఁగా జవరాండ్రగూడియున్. ౬౩

ఉ. కొమ్మలనత్తమిల్లు విరి ♦ గుత్తులగోరులఁగిల్లుగేఁగిన్
బొమ్మలనల్లు పొన్ననన ♦ పుప్పొడిచేతులఁ జల్లుతావిపూ
రెమ్మలగిల్లు కందుదిగు ♦ రించిన తానెదఁదూపటిల్లు చొ
క్కమ్మడి సొమ్మసిల్లు మది ♦ నోటమిఁగల్గిన పెల్లుపెల్లునన్. ౬౪

ఉ. మొల్లలఁజూచి నిక్కు సుర ♦ పొన్నలసీడలఁదక్కు పండులన్
కొల్లలుఁగాను మెక్కు పువు ♦ గుత్తులతా సిగలోన జెక్కుమేల్
మల్లెలఁగాంచి సొక్కనన ♦ మావులగన్గొని యెక్కు జేజెకై
యుల్లములోన మ్రొక్కుచను ♦ వొప్పఁగ జిక్కువడంతిదాటుకున్.

కం. ఈపరుసునఁ జెరలాఁడుచు
నాపఁడతుకమిన్నతోటి ♦ యతివెలకెల్లన్
బూపొదలఁనిచ్చఁ దిరుఁగం
గావగ్గఁజెలంగయాన ♦ గావించెనొగిన్. ౬౬

తే. గీ. యానవిచ్చినతోడనే ♦ యులరుబోండ్లు
కాలుకారగు పొదలను ♦ దూటిదూటి
యంచలకు సిగ్గుఁగదుర నొ ♦ య్యారమొదవు
నడలనడుచుచు కొండలు ♦ నవలలపుడు ౬౭

కం. చిల్కలకొల్కి యొకతె పం
డులఁగోసెను క్రొత్తననల ♦ డులిచెనునొక కో

యిల కుత్తుక తుమ్మెదచా
యల నెఱుకలఁబోటిఁ ద్రావె ♦ నలవడు తేనెన్. ౬౮

ఉ. రవ్వలుకెంపు లున్విరివిఁ ♦ గ్రాలఁగఁ గూర్చిన కోటయోయనన్
మవ్వపుతీవెయిండ్లనడు ♦ మన్నెలరాలనుఁ దీర్చ గద్దెపై
జవ్వని యోర్తుకూరుచొని ♦ సారెకు సారెకుపీనె సారెలన్
నవ్వుచు బిగ్గజేసి వల ♦ నంగడు పాటలఁ బాడె నత్తఱిన్. ౬౯

ఆ. వె. మత్తియూడ నెక్కి ♦ మగువమిన్న యొక్కర్త
యూగుచుండ బిగువు ♦ నుప్పరంబు
నంటబోయి మనసు ♦ నింటికెలంకు కెం
దమ్మి గమినిగన్ను ♦ తమకుఁదోచె. ౭౦

ఉ. తియ్యని మావిపండులనుఁ ♦ ద్రెంపియు కుప్పలుబెట్టి యొక్కమే
ల్తొయ్యలిసాటి చేడియకు ♦ తోఁదగగేవఁగి బొమ్మ పేరణం
బొయ్యనఁజేసి నెయ్యమున ♦ వాళిఁగ పాటలఁ బాడి కొందఱిన్
వియ్యపురాండ్రటంచు మఱి ♦ విందొనరించె నొయారమొప్పఁగన్.

క. తేటుల మొత్తము కమ్మని
తేటంగల తేనెఁ ద్రావి ♦ తిరుఁగఁగ నెమ్మిన్
బోటియొకతెఁ జిలుఁగుముకున్
బోటిఁగఁ జూపించి వాటి ♦ పురి విప్పించెన్. ౭౧

తే. గీ. చెలువలిద్దరు పువ్వుల ♦ చెండులాఁడు
తరి నొకటి నొక్కరిత పైటఁ ♦ దవిలిఁ జిక్క
మూడు పాలిండ్లుఁ గలిఁగిన ♦ ముగుద యనుచు
పొలతులందఱు నవ్విరి ♦ పొల్పుతెనఁగ. ౭౩

క. కంటుతనంబున తుమ్మెద
కంటువు పువునొక్క వాలు ♦ గంటి కొనుచు వ

ల్వంటి ముకుఁకకును గాదని
వంటవలఁతిప్పైన మరల ♦ బారఁగ వేసెన్. ౭౮

ఉ. తిండ్లకు కమ్మనై మెసఁగు ♦ తేటులువాలెఁడు పూలగుత్తి పూ
బోండ్లకు వ్రేలఁజూపి చల ♦ ముక్మదిఁబుట్టఁగ జూచి నాదు పా
లిండ్లకు సాటిరావనుచు ♦ లేమయొకర్తుక కెంపులార లేఁ
దూండ్లనుఁబోలు కెల్దుగల ♦ తో విడళించెను హా సుమీరగన్.

క. నవల రతనంబు లొకయెడ
గవకవలుఁగ యొకరికొకరు ♦ కమ్మని నుడుల
న్వివరించిరచటి సొద్దెము
ల వలపులుప్పిర మొగము ♦ లను నవ్వొలయన్. ౭౯

సీ. అలమావిఁ జేదుగ ♦ లంట నెచ్చెలి యొర్తు
గోరంట కౌఁగిలిఁ ♦ గొనె నొకర్త
పొగడఁగల్లు మివేసి ♦ పూఁబోడి యొకరిత
కంగేలిఁదన్నె నొ ♦ క్కరిత నగిమొ
పొన్నదాపునఁ జేరఁ ♦ బోయి నొకర్తుక
గోగుల మేల్మూడి ♦ కొసరె యొకతి
చెలియోటి వావిలిఁ ♦ జేరి నిట్టూర్పిడి
నొకతిఁ బొట్టుఁగు నక్క ♦ టికమునఁ గని

తే. గీ. ప్రేంకడంబుల నొకసకి ♦ ప్రేముడి వగ
మేలుపాటలఁ బాడియు ♦ మెలఁత యొకతి
సంపెఁగిని పాటమొగమున ♦ సొంపుమీర
పుప్పములఁ గల్గఁజేసిరి ♦ పూనికగను. ౮౦

(ద్విరదగతిరగడ)

కలికి కనుతోఁట సిం ♦ గారముల గారముల
పొలఁతులకుఁ జల్లుగం ♦ బూరలను బూరలను

దట్టించి మెక్కువిరి ♦ తావులను తావులను
మెట్టవే విరివిఁగను ♦ మేవడిని మేవడిని
కూటువుఁగ దూఁకుమనె ♦ కొమ్మలను కొమ్మలను
నీటుఁగా దెమ్మదా ♦ నిమ్మలను నిమ్మలను
పొలుపొంద యేఱుసుర ♦ పొన్నలను పొన్నలను
గులుకరించెడు నేన్గు ♦ గున్నలను గున్నలను
నిలచి యూపితిని గ ♦ న్నెరుపూల్ నేరుపుల్
వెలుఁగ సిగఁజెక్కుకురు ♦ వేరులను వేరులన్
తిరిగి నవ్వలకేగి ♦ తేనెలను తేనెలను
తిరముగా దిద్దు వలఁ ♦ తీనెలను తీనెలను
చేరుగా గూర్పు మట ♦ జిగురులను జిగురులను
పోరేల మల్లియల ♦ పొగడలను పొగడలను
తెఱచిచూడుము గిరక ♦ త్రాఁడులను త్రాఁడులను
వెఱపేలనిక కుబ్జ ♦ వేడుదము వేడుదము. ౭౮

క. ఈరమణ నొకరి కొక్కరు
వేరులతో వారి వారి ♦ బిలుచుచు తమదే
వేరిని వేడుచు నచ్చట
కోరికలూరంగ నాడు ♦ కొనఁదగు ననుచున్. ౭౯

క. బుజములకై లొడ్డుచు చెలి
పజ లిరువంకలను నిలిచి ♦ పరిఢవ మొప్పన్
గుజగుజ రేకుల నాఁడిరి
గజిబిజి యెడలోన వదిలి ♦ కానను వేడ్కన్. ౮౦

తే. గీ. తీగె యీరములోఁ జేరి ♦ తెఱవమిన్న
లెదల హారుసంబు బెనఁగొన ♦ నదఁటుఁ గలిఁగి

కొంతవడికిని నలుగురు ♦ గూడిగూడి
యచ్చనాలాడిరచ్చట ♦ యిచ్చదీర. ౮౧

క. ఉప్పచ్చులు ♦ గొబ్బిళ్ళను
కుప్పిలుసుదన్ను బిళ్ళ ♦ గుడిగుడిగుంచా
లుప్పెన బట్టెలు ♦ సిరికి
ల్దప్పకనాడిరి మురిపెము ♦ దళుకొత్తంగన్. ౮౨

వ. ఇట్లా జోటిమేటి బోటికత్తియల కూటువల కూటమితో యాట తోటలఁజేరి చెలుకువిలుతు డొరబెత్తికిన నిగనిగ మెఱుగులీను విరికఱుకుటమ్ముల నెఱిమీరి నత్తెఱవ కడకంటి చూపుల నెల్ల దెసలఁ బరికింపుచు కమ్మనితమ్ముల కమ్మనీరు నెమ్మినిదిమ్ముదీరఁ ద్రావి మమ్మరమ్ము మమ్మరించ జుమ్ముజుమ్మన రొదాళమ్ములు సేయు తుమ్మెదల మొత్తమ్ములు కొమ్మల ముంగురు లొక్క-మ్మడింగని తమకొలమ్మని లేచి ద్రిమ్మరిల్లుచున్న గఱుల చాయ లంజూచి నిబ్బరంబగు ప్రబ్బులనిగొబ్బున నుబ్బుచు తమతమ పించియమ్ములవిప్పి తుంపెసలాడు పించెపుకుంచె పిట్టలను మెల్లె మెల్లన కాలియందియలు గల్లుగల్లుమన నదలించుచు గుబ్బకొను గబ్బిగుబ్బల బరువున పిడికెడుమేరఁగల నడుముగడగడ వడకుచుండ వెడవెడ నడుకలు తడబడగ రాయంచల కొయ్యారంబుఁజూపుచు చల్లని పిల్లగాడ్పులు మెల్లమెల్లనవీవ తెల్లని మొగడలు కొల్లలుఁగ వెల్లివిరియు మల్లియలపొదల నల్లనఁదూఱుచు జారుబండలం జారుచు గొప్పనగుచలువ చప్పరంబులఁదూరుచు మెప్పముఁగల యరంటితుప్పల దెప్పలగు కప్పురంబుల తావుల కప్పుడప్పుడు జేకుచు పుప్పొడులపై పుప్పొడులఁ గుప్పుచు చిన్నిచిలుకల పలుకులకులికి నిలుకడలేని డెందంబున వానిని రొప్పుచు తనసారంబునకు కోయిల మొత్తంబులీడుగావని బిత్తరంబున తత్తరంబులేని

సారంబుల కూయుచు పుప్పొటీరంబులం డాయుచుజక్కవపక్కులు నిక్కవచ్చిన సొగసుగల తొగలరాయని నిగనిగలదగులు మొగముంజూపి దిగులుఁబడసేయుచు పూలగురివెంద పందిరులనెక్కుచు తియ్యని మావిపండుల మెక్కుచు నలరుల నేలబడరాల్చి తన యొడలి గందమునకుసరియని తమకంబున యెదజల్లుచు తనయిచ్చగలతలంపొడఁగూడ సేయుండని కొనవేల్పులకు మ్రొక్కుచు నా సింగారంపుటెలఁదోఁటలో పలువితంబులైన సొద్దెంబులు తద్దయు ముద్దియ నూచుచు ద్రిమ్మరిల్లుచుండెనంత. ౮౩

తే. గీ. ఇటులఁదిరుఁగుచు కుబ్జయు ♦ నింతులపుడు
నలసిసొలసియును స్సర ♦ టంచుచందు
రాఁదొగల్ జెక్కగద్దియ ♦ రానఁగలుఁగ
గూరుచుండిరి ♦ కమ్మని పైరవీవ ౮౪

తే. గీ. చెలుల మొగముల చెమ్మటల్ ♦ చెమ్మరించ
చెఱఁగులను బండుటాకుల ♦ జేతబట్టి
పొసఁగ బడలికఁబోవంగ ♦ విసరుకొనుచు
తియ్యనుడికారమున నొక ♦ తెఱవఁబలికె. ౮౫

తే. గీ. వింటిరేమీరు మరునివా ♦ ల్గంటులార
యిచటఁగూర్చుండ మనకింక ♦ నిజముఁగలుఁగు
గానకమ్మని చల్లని ♦ గాలివీచు
కొలఁకులనుజేరి సీరాడఁ ♦ గలుఁగులగ్గు. ౮౬

క. అనవిని మంచిదటంచును
ననఁబోఁడులు గుంపుఁగట్టి ♦ నంగుబ్జయుఁదా
జననిచ్చఁబూని తా మె
ల్లనిమాటల సాటిలేమ ♦ లకునిట్లనియెన్. ౮౭

తే. గీ. జుట్టుపిట్టలు పొదరిండ్ల ♦ పట్టుఁజేరె
వెలుఁగు దొరరాల మెలకువ ♦ లొలికెవెచ్చ
వెలుఁగుచే బాటసారుల ♦ పొలుపుఁజారె
పట్టఁబవలాయె నిక్కాన ♦ మిట్టిపడుచు. ౭౮

క. వడగాలి రేగె నీడలు
కడుపొట్టివి యయ్యె ♦ పులుఁగుగమి చెట్టులపై
విడిదిఁగొనె నాగుబాములు
గొడవము నన్వాడిరోజు ♦ గొనిపవలించెన్. ౭౯

ఉ. పూపొదబెంకియా చెవుల ♦ పోతులు మిక్కిలి వేడియెండచే
దూఁపిలికాలు నాకెపస ♦ దున్నలు నీటిబిడారు పంకిలో
తేపకు తేపకుంబొరలె ♦ తెల్లమెకంబుల కూటువుల్లవిన్
గైపువగర్పు నొందె, బసఁ ♦ గాగొనెనంచలు తమ్మిజీబులన్. ౮౦

ఆ. కానయిట్టి తరిని ♦ కమ్మనిచల్లని
గాలివీచుచుండఁ ♦ గా కొలంకు
జేరి తానమాఁడ ♦ దూరిబోవుసరమ
మంచిబలికితమ్మ ♦ మరునికొమ్మ. ౮౧

క. దిట్టరియీవగఁ బలికిన
కట్టడికిని హరుసమెల్లఁ ♦ గ్రమ్మంగనుబల్
రెట్టింప నవలలందొఱు
నట్టుంగొట్టక యెడఁదల ♦ నాణెము గలుగన్. ౮౨

తే. గీ. ఉండనొక్కటె యందులో ♦ నుండిలేచి
నాల్గుదెసలనుఁ గనుఁగలి ♦ పుల్గుగములు
లేచి వాలెడుచోటుల ♦ లింగనిమఱి
పొలఁతుకలనుఁ గనుంగొని ♦ పలుకుఁబలికె. ౮౩

చ. మగువల మిన్నలార విను ♦ మానసునా యొకతమ్మికొల్కును
దుగమనికల్ వెలింగె సెగ ♦ ఢుంకును దానినిచూచునంత జా
గుఁగొనుటకేల యింక మన ♦ కోయనఁ జేడియలొక్కపెట్టునన్
సుగము సెలంగికమ్మ విను ♦ చూలియువీవఁగ తేచిరందఱున్. ౯౪

ఆ. లేచి వేడ్కతోడ ♦ లేమ మేల్బంతులు
తూడుతిండినడల ♦ తో నొయార
ముప్పమల్లెమొల్ల ♦ తుప్పలఁబొదలచే
తనుఁ జెలంగుఁద్రోవ ♦ దమినినడచి. ౯౫

క. సరివాల్గంటులు నెమటఁగ
సిరియెద బాకీస్నెలంగ ♦ నెగడువిరాళిన్
దరఁగల తేటిరవాళిఁ
గెరలఁగ పుల్గులపిసాళి ♦ కేళాకూళిన్. ౯౬

చ. కనుఁగొనివేడ్కతోఁ గలువ ♦ కంటులు తీఁగమెఱుంగుబోడి వెం
టనుఁ జనికేకిసల్ జరచి ♦ డంబగు వేల్పులవాకనెల్లత
చ్చనముఁను సేయునంచు నెద ♦ సంబరమొప్పఁగ నొడ్డుపొంటినుం
దుననలతీవె జొంపముల ♦ డొంకుచు నందొకకొమ్మవాకొనెన్.

క. ఈకెందామరల హారం
గీకలువలరోకు కడుర ♦ రహిన్ విసములసా
రీకమ్మఁగాలి రమణం
బీకొలనునఁగాక నేల ♦ నేకొలనున కొ. ౯౭

(తరళవృత్తము)

మొలను మేల్కయిదమ్ము లానుచు ♦ ముద్దరాండ్లాయొడ్డునం
నిలచియచ్చోటఁ గలుఁగుచుండిన ♦ నీటిసొద్దెములప్పుడా
చెలువమిన్నకు విన్నవించి ప ♦ సిండియుందెలు గల్మనన్
నెలకలంబని సేయుమెట్లను ♦ నెమ్మిఁగాఁ దిరుఁగాడుచున్. ౯౮

చ. తమతమ నీడలాదరిని ♦ దప్పకచూచుచు సాటివారలం
చు మొగములనంజిరాగుఁబలు ♦ జొప్పడఁగచ్చకు కాలుద్రవ్వన
ట్లు మనసుఁగాంచి ముద్దులుపొ ♦ టుక్కనకాలను నేలరాయునా
గమనికవేరు చేడియలు ♦ గన్గొని చిర్నగువవ్విరత్తఱిన్. ౧౦౦

తే. గీ. తేటిమొత్తమ్ము బసువుచే ♦ నీటుఁదమ్మి
మొగడపై వ్రాలుమనఁదోఁచెఁ ♦ బిగువుఁగలుఁగు
బిత్తరియొకర్త మగఁడు చ ♦ న్నొత్తులలిని
గనుపడియె కొమ్మవన్నె బం ♦ గారుబొమ్మ. ౧౦౧

తే. గీ. అసలుఁ బుట్టుఁగు మొగడపై ♦ వసఁజెలంగ
జమిలిముక్కాలి వ్రాలిన ♦ చందమొన్న
కొలఁకువలపు మిటారిమే ♦ ల్కులుకు గుబ్బ
దుగలగను పట్టుమొనలనఁ ♦ దోఁచెఁగసవె. ౧౦౨

చ. తొలకరిసూఁడు తెల్లనెద ♦ ద్రుక్కుచు మేలగుతమ్మితూండ్లకై
జలకములాన వ్రాలుచును ♦ సయ్యనలేచుచు నున్నపొల్పులీ
కొలఁకను తీఁగబోఁడికులు ♦ కుల్గల తెల్లని పూలబంతుల
ర్మిలి చెరలాడెనో యనెఁడు ♦ మేరకనుంగొన వేనుడంతుకా. ౧౦౩

క. ఇట్టియొయారములనుఁ గని
పెట్టుచు పిననగవులెగయు ♦ ప్రేముడిమదిలో
నట్టిపడ వెలఁదులందఱు
గట్టిన వెలిఁపట్టువలువ ♦ గమివిడచిమనన్. ౧౦౪

ఉ. సొమ్ములుఁ దీసిపెట్టిపడు ♦ చుల్మసచందురు కావిపట్టముల్
నెమ్మదిఁగట్టి రొమ్ములకు ♦ నిండుగ చీరచెఱంగు సొంపులు
న్నమ్మతిలం బిగించి పలు ♦ మారును కాసెలబూసి దొండొరుల్
తమ్ములఁ బోలుకైసికయి ♦ దంటఁగబూనుచు నొక్కపెట్టునన్.

చ. తిరుగుచు నొడ్డుపైని తమ ♦ తీరుఁగు నీడలనీటు నీటిలో
బరువడిఁజూచి చూచియు సె ♦ బాసని యీరసఁబూని జిఱ్ఱునన్
విరివినిగల్గు తంతియల వీఁకను ♦ డిగ్గుచు సాటిరూపులున్
వెరఁగున మాయుమానటుఁగు ♦ భేల్లనిమ్రోతలుఁ బుట్టదూఁకినన్.

ఉ. దూఁకినతోడనే చెలులు ♦ తొంటి తెఱంగున మళ్ళిఁదేలిమి
న్వాకనుమేల మాడుచు జ ♦ వంబుననట్టిటు లీదువారు నీ
ర్వైకిని లేచువారఱుఁగుఁ ♦ బట్టగ మున్గెడువారు కొల్నుచీ
కాఁకుగ నింగినంట జల ♦ కంబులు జల్లెడువారు నీతొఁగన్. ౧౦౭

క. హల్లాకొల్లారము జొ
త్తిల్లఁగ చేడియలుఁ దూఁకఁ ♦ దిరిఁగికొలఁకు బె
గ్గిల్లి ననుసరమఁచెట్టకు
డుల్లోయని మొరలిడెనన ♦ నొప్పెరవాళుల్. ౧౦౮

ఆ. తమ్మికమ్మనీరుఁ ♦ ద్రావుటచే మస
కాఱుకురులసాటి ♦ గాంచెనంచు
తుమ్మెదలనుఁ జోపు ♦ తొగబడంతులుగుట
తానమాడుచుండ ♦ దరులఁజేరె. ౧౦౯

క. పేరిమి రాయంచలు నొ
య్యారుల నడచక్కదనము ♦ హాయిఁగగని ప
ల్మారుమనను వారలుఁగని
కేరుదురని నింగిఁజేరి ♦ కినమునఁబడియెన్. ౧౧౦

చ. చెలువలమోము తామరల ♦ చెల్వముతో సరిరాకపోవుటే
బలిసిన తేంట్లుఁ దేనెఁగొనఁ ♦ బంటులమైతిమి వీటి బాయపెం
పలరెదమంచు వీడిమఱి ♦ హానులఁజూచిన వెత్తియయ్యె నే
లలఁబడుతీరు మేటియల ♦ లందలముక్కలు వ్రాలెనూఁగుచున్.

క. నీరున పొలఁతియొకతెయొ
య్యారమున న్మునిగికొంత ♦ హాదనునలేవన్
బేరిమినవ్వుపు చెలులన్
జేరిచెలిమి సేయఁబోవు ♦ చెలువుగను పడెన్. ౧౧౨

క. బిత్తరమగు హొంకుమ్మంజీ
ముత్తియముల చేర్లువ్రేలు ♦ బుర్రటకొమ్ముల్
బిత్తరులుఁదాల్చి యిరుఁదెస
లొత్తుఁగ నీరాఁడిరచట ♦ హొయలుఁ జెలంగన్. ౧౧౩

ఉ. కొట్టముచొప్పు నన్వెలఁది ♦ కూటువులెల్లనుఁగూడి నీరుచ
న్నెట్టులఁ దట్టనిల్చియెడ ♦ మేలని చిమ్మనఁ గ్రోవి కేలునన్
బట్టివిసంబు బీర్చి గరు ♦ వంబును దొఁత్రిలచిమ్మతుంపరల్
బుట్టఁగనూది జల్లిరట ♦ మోములగుబ్బలపై దలిర్పఁగన్. ౧౧౪

చ. సరగున మోముచందురుని ♦ చాయలు కన్నులకమ్మి జంటపై
బరివిన మోసమాననుచు ♦ బల్మరుమోమును మూమకల్లటన్
విరివిఁగనీయ బూనెనన ♦ వేఁగనులం జెవులంముకంది బి
త్తరముగమూసి యొక్కచెలి ♦ తమ్మికొలంకున మున్గెఁగక్కునన్.

క. జలకంబులోన కొందరు
వెలికిలబడి నీదుచుండ ♦ వీఁకనుఁగాళ్ళన్
బలుమరు లేపఁగ వేల్పుల
చెలువలపై కాలుఁద్రవ్వు ♦ చెలువుం దోచెన్. ౧౧౬

చ. వెలికిల నీటనీదగను ♦ వింతగ గుబ్బలుఁదమ్మి మొగ్గలం
చలరుచు నంచకూటువలు ♦ హాయిదలిర్పగ రాగకల్కివే
దలకుచు బోరఁగిల్లఁబడ ♦ దారగు కావిరి కొప్పు గాంచి పిం
పల రెడుమబ్బు లంచెడద ♦ నర్మిలిఁబోవిడి బారెనల్దెసల్

సీ. ఏనుఁగు నడయొ_ర్త • యెగవుతనమ్ములు
తులఁదూఁగు తమ్మిలఁ • దునిమివేసె
సంపెఁగి గందియు • నింపొందు కొందుమల
తుమ్మెర బారులఁ • ద్రుళ్లఁజేసె
దోరంపు జిగిమొగు • ల్తురుముగల్గిన నాతి
రాయంచలను బల్ప • రాకువరచె
మోము మోమోర్తుక • మక్కువఁ బోనాడి
జక్కవపక్కల • నుక్కఁచేసె

గీ. నిత్తెరంగునఁ దిరుగుచు • బిత్తరముగ
తమ్మికంటులు తేటివి • తంపుకురుల
చెలువమిన్నలు నంచయా • నలునుజక్క
వదుగగుబ్బెతలీదిర • బ్రమ్మ దోవ. ౧౧౮

చ. కలుకులు మోముదమ్ములను • కస్తురిపస్పునుఁబూసి నీటిలో
వలఁగదుఁ దోఁగి తామరల • బల్మరుచేతులఁబట్టి యొడ్డునం
దలరుచునేగుఁ దెంచిరియొ • యూరులు సంద్రపుగట్టుకై మునుం
గలిమినెలంత దమ్ములను • కైఁగవఁదాలిచి వచ్చుపోలికన్. ౧౧౯

క. అదిగో లెకమ్మఁ గాడుపు
లాదవినమై మెఱుఁగులీన • సువిదలమిన్నల్
ప్రిదులుననతీవె జొంపపు
చదురున వనిసేయు చలువ • చప్రములోనన్. ౧౨౦

క. ఈరూపున చెలులందఱు
జేరినకుబ్జకును పనులుఁ • జేసెను చేడెల్
తోరంపు తొడవులును జ
ల్తారు చెఱఁగుచీరఁదెచ్చి • తాలిమినంతన్. ౧౨౧

తే. గీ. తపసికన్నెపతేవను ♦ దారుమీఱు
నిగ్గుఁగలకాఱు జొబ్బిలు ♦ నీటిచాగి
కప్పికురిసెడు వితము మొ ♦ గయునఁ జాల
తడికురులవెంట జలకము ♦ దవిలెఁజారె. ౧౨౨

తే. గీ. కారుమ్రబ్బును నెగ్గాడు ♦ కారుకురుల
నొక్కచెలివచ్చి తడియొత్తి ♦ చిక్కులెడల
దీసిమల్లియకడినూనె ♦ తిరుఁగబెట్టి
తొలుతఁదాల్చిన చంద్రకా ♦ వుల సడల్చి. ౧౨౩

క. జలుతారు చెఱఁగుపసజా
బ్బిల తెల్లనిపట్టుచీరె ♦ పిడికెడుమేరం
గలకౌనున బలుకుచ్చి
ళ్లలరఁగమైఁ దాల్పఁజేసి ♦ రతివలమన్నల్. ౧౨౪

తే. గీ. గుబ్బలుల మేటినిబ్బర ♦ మబ్బయనెడు
గబ్బిగుబ్బల జంటపై ♦ కారుజిలుఁగు
మొగ్గవనిఁజేసి కెంపులఁ ♦ బొసఁగఁగూర్చు
రైకచెలువారఁ చెలువ బి ♦ ఱానఁ దొడఁగె. ౧౨౫

సీ. చిన్నిచందురు మామ ♦ చెన్నగుమోమున
చేర్చుక్కఁ బొట్టొగి ♦ చిందులాడ
నెమ్మది చెవులకు ♦ కమ్మపౌఞ్జులనిగ్గు
చెక్కుటద్దంబుల ♦ చెమ్మఁగిలఁగ
నక్కునరతనాలుఁ ♦ జెక్కిన పతకముల్
వరఁగలించెడు బన్న ♦ సరులుగదుర
తెఱవాయ మెకమునుఁ ♦ దెగడు మెల్నడుమున
బిల్లల మొలకట్టు ♦ బిగువుమెరయ

గీ. తళుకు చేకట్లు సందిటి ♦ తాయెతులును
కేలుదమ్ముల డాల్మిగ ♦ రాలముద్దు
టుంగరంబులు బదివేళ్ళ ♦ నొప్పకాళ్ళ
గజ్జెలందెలు మట్టెలు ♦ ఘల్లుమనఁగ. ౧౨౬

తే. గీ. తొమ్మిదివితంబులునుఁ గల్గి ♦ తోరమైన
రవలఁగూరిచి పనిసేయ ♦ రంగులెసఁగు
ముక్కెరబులాకి సత్తును ♦ మురిపెమునను
నూవుఁబూఁబోలు ముక్కున ♦ చేవఁబెట్టి. ౧౨౭

క. ఈసారున నాకుబ్జకు
సైసేసి రయియూరులట్టి ♦ కారునతాము
ట్లానూటిఁ జెలఁగివారల
బోసనములుఁ దెసలఁబర్వ ♦ పొలతుఁలు పెలుచన్. ౧౨౮

ఉ. చీటికిమాటికి న్వలవు ♦ చెమ్మగిలందగు గాలివీవ పెం
దోఁటకురాళమందు వనఁ ♦ దొట్రిల మేటికలున్న గద్దెపై
చీటకమొప్పఁగ న్రవలఁజెక్కిన ♦ వన్నె పసిండిసింగవుం
బీటకుదిర్చి పైనిసరవింగడు ♦ గుబ్జపడంతి కూర్చొనెన్. ౧౨౯

క. మలపగతురాణి వేల్పుల
కలుకులుఁ గూర్చున్నకొలువు ♦ గమనికకుబ్జన్
గొలచియు గూర్చొనిరచ్చట
దలిరాకుం బోఁడులెల్ల ♦ దనుకులుఁ దొలఁగన్. ౧౩౦

మ. పిదపన్ గుబ్జపడంతి నివ్వెఱఁగునన్ ♦ బెంపొందు చీకాఁకు నె
ద్దఁదలిర్పంగ న్ననవిల్తుడార్చుచును కో ♦ లంగూర్ప మంద్రాడమున్
గుదురై మేనొప్పనుకాడ దూపటిలి ♦ స్రుక్కుం జెందియు న్బెట్టునుం
వదులంగన్నులవెంట నీర్వరదలై ♦ వారంగనొక్కుమ్మడిన్. ౧౩౧

క. ఇరుగడలనున్న సోబతు
గరితలగను రెప్పలార్ప ♦ కనుగన్గొని యీ
విరిహాదనుఁ దోఁటలోఁ ద్రి
మ్మరఁగను వెఱపేఁకిబుట్టె ♦ మఱినేమగునో. ౧౩౨

క. వలనాటుకొనెనుఁ గడునా
వలనా యాకాఁకనీరు ♦ వామినియీఁదన్
గలనా నాచేరువనుం
గలనాఁతుక మానికములుఁ ♦ గావరెనన్నుక్. ౧౩౩

క. అని తియ్యనిమాటాడన్
గనునేస్తపు చెలులలోనఁ ♦ గన్నాకగువ
ద్మిని నాఁబేరటిచేడియ
వినియూరకయున్న బిలిచి ♦ వివరించె నొగిన్. ౧౩౪

క. తలఁపున కలవరమెల్లం
దులదూఁగెను వెన్నపాల ♦ దొంగకు నాపై
చెలిమిఁ గలుఁగఁజేసియు నా
యిలుఁ జేరందోడితెమ్మ ♦ యేననుమాటల్. ౧౩౫

క. వినుమావిని వైశముగన్
జనుమాజని యల్లవాని ♦ సరిసంగడమున్
గనుమాగని నావేంద్రము
లనుమాయని తోడితెమ్మ ♦ యంకముఁ దొలఁగన్. ౧౩౬

చ. అని చెలియింక కొన్నిటి రొయి ♦ యారికిఁ జెప్పినవీనులారఁగా
విని తనబుద్ధిలోన బలు ♦ వింతలు సంతసముల్లసిల్లఁగక్
దనవినినేయు మాటలవి ♦ తంబునకుం జిరునవ్వు చెక్కు జం
టను హావళింప చక్కెరకు ♦ తావగుమాటలుఁ బల్కె వేడుకన్.

శా. అక్కా విన్ గను రెప్పపాటుఁ దరిలో ♦ నై బోవనుల్గా దెసి
విక్కాఁ గల్గొను టేల నమ్మమటి ♦ నిడ్డే నేగి నీచైదముల్
నిక్కం బెంతటఁ దీర్తు నమ్మికలతో ♦ నీయిల్లు చేరంగఁ బో
దక్కింతుర్ గతి వేల్పు నీకు ననవి ♦ ల్దారింగ వాళింపుచున్. ౧౩౮

క. అక్కరొ యాతనిరవలం
జెక్కిన మంచమున పూలఁ ♦ జేరువఁ దగు నీ
ప్రక్కవరుండఁగ బెట్టిన
చక్కెరవిలుతుండు ని ♦ న్గొసరి బానిసెయా. ౧౩౯

క. ననతీవెఁ బోఁడియా వై
పనియూరడిలంగ బలికి ♦ హాళి యెసంగన్
దనుఁ బోవ కట్టడం గొని
జనె గరుటామంతు రాతు ♦ చక్కని తలకున్. ౧౪౦

ఉ. నాఁవిని నేలతేఁపురమ ♦ ణన్మది తామరవిప్పనిట్లనెన్
తీవ మెఱుంగుఁ బోఁడిజన ♦ దేవెరి యోమననుండెనోయిటున్
బోవఁగఁ దల్చెనో యటకుఁ ♦ బోయిన చేడియ వచ్చుదాఁక నా
పూవులఁ దోఁటలోపలకు ♦ బూనెనొకన్నయ మీఁది బాళిచే.

క. ఆకతలవితము లెల్లను
జోకలుఁ జెలువారఁ జెవుల ♦ జొరఁగను నాకుం
వీఁకఁ గొని తేట తెల్లమి
వాకుల వివరింపుమయ్య ♦ వదలని రాణన్ ౧౪౨

సుగంధీవృత్తము

కారునీటి చాగిమంచు ♦ కార్హొరంగు చూపరీ
పోరుతిండి మిత్తిగొంగ ♦ ప్రొద్దుచూలిబమ్మలున్
నీరువామిఁ జేరి కేలు ♦ నెత్తిఁ జేర్చి మ్రొక్కఁగా
గారవించి ప్రోచుమేటి ♦ గట్టుఁదాల్పు వేలుపా. ౧౪౩

మ. కుతిసీవీణము జిల్గురింగులసిగల్ ♦ గోరాడమాతాబి సా
ల్వతమింగప్పి పులుంగుజేని బుజలన్ ♦ లావొప్పగూర్పుండితే
క తెగన్ గావఁగముజ్జగంబులు వెలుం ♦ గన్నారి గావించు మే
ల్రతనాల్గూర్చిన వేల్పుగొండ నెలవై ♦ రాణించు కార్వేలుపా.

( గద్య. )

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహాకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘుల్ చక్రవర్తుల రంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతం
బైన అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణ
విలాసంబను సింగార కబ్బం
బునందు ద్వితీయా
శ్వాసము

శ్రీ







శ్రీమతే రామానుజాయ నమః

( శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః )

శ్రీ విష్వక్సేనాయనమః॥

# అచ్చతెనుఁగుకుబ్జాకృష్ణవిలాసము

( తృతీయాశ్వాసము )

క. సిరిచాన మేనుతీవను
విరియు చనులపూలగుత్తి ♦ విడిమట్టగు తే
టిరహిన్వేలువు గొండను
మరిగిన రక్కసులగొంగ ♦ మానిసి సింగా. ౧

వ. ఆలకింపుము. ౨

క. అనితపసి కట్టిమనుమం
డునుఁ బల్కినపల్కులకు పో ♦ టుక్కన బుద్ధిం
బొనుకాడెడు హరుసంబున
వినిచిన్నగు చెక్కులొత్తి ♦ వినుపించె తగన్. ౩

తే. గీ. అటులఁబద్మిని నాచెలి ♦ యలరువిల్తు
డున్నపట్నముఁ జేరంగ ♦ తెన్నునడచె
నంతగాములజేడు తా ♦ వింతవెనుక
దెసనుఁగల కొండపై ప్రవాలె ♦ తిరముగలిఁగి. ౪

ఉ. ఆ మనఁబోయినాక చెలి ♦ యారెము నన్వలవంతమీరి పెన్
బాములనొందుచుండఁగ సె ♦ బాసని క్రొన్ననవిల్తు దొడ్డగా
నామనిచందమామ సుర ♦ లచ్చటఁగొల్వఁగ గొల్వునుండిగా
రామున బల్లిమందరకు ♦ గ్రమ్మన నేమనఁజేసె చెయ్వులన్. ౫

ఉ. చేసినతోడనే వెడలె ♦ చెందవవిందును గాలిఁబూదజీన్
వేసనిఁగుల్కనుంచి విరి ♦ విల్లునుగేలను దాల్చి వేటకౌ
వేసముఁబూని క్రమాకులను ♦ వింతగుమాటును బొంచిపొంచి సం
తోసమెలర్స గన్గొనెను త్రో ♦ వను బెగ్గిలులేడికంటిఁదాన్. ౬

క. కనుగొని గోర్వంకల వే
గున కన్నిరయొయార మొప్పఁ ♦ గోగిలగమిజా
ట్టును ముట్టనిలిపి నేనా
మనిచాల్పుగనునిచి వేఁడ్క ♦ మదిఁజిల్కతోగన్. ౭

క. ఉసికొలిపి పిదపననవి
ల్లైనఁగఁగ పూవాలుఁగూర్చి ♦ యీరెముకూటుం
ససిఁగఁగొని చనులనడుమను
కసిదీరఁగ మలయనేసె ♦ కాతాళముగన్. ౮

వ. ఇట్లేసిన కనలి యురువడించిన నబ్బలగంబును. ౯

చ. కనితలపోసి కొంతవడి ♦ కన్నులరెండిటనుండి వచ్చునీ
ర్చనుగవ కొప్రమందు బడి ♦ జారఁగకుందుచు గువ్వగుత్తికన్
వినుఁడువెలందులార నన ♦ విల్తుఁడునున్న నితూపులేసె క్ర
న్ననపులుకాఁసి పుల్గులుక ♦ నారిలిబల్కులు బల్కె వెండియున్.

ఉ. మోసెను తేటిమొత్తములు ♦ ముజ్జగమందున తేజువెన్నెలం
గాసెను చందురుండు చలి ♦ కమ్మనిపయ్యెద తావిముల్కలన్
వేసెను గండుకోయిలలు ♦ విన్దెసలెల్లను నిండునట్లుగా
కూసెనికేగ తిన్మరుల ♦ కున్మదినోరుతు నేమనేయుదున్. ౧౧

క. అనితనను దెప్పరములం
దనునేసెడు తేటిరామ ♦ తమ్మనుగోర్వం
కనుతలిరు మెపరినినిం
పున సమతంబెట్టఁ దలచి ♦ పొలఁతుక యనియెన్. ౧౨

ఉ. తేటివలంతులార పువుదేనియ ♦ లంగడుఁద్రావిత్రావి మా
తోఁటివసందు మీరఁబలుత్రోవలఁ ♦ బోవకనొక్క తీరు మో
మాటము లెంచియుండు డది ♦ మంచిది యిప్పుడులేక పోయినన్
జాలెద మమ్మొదర్చినను సంపెఁగి ♦ గందులమంచు మెప్పుగన్. ౧౩

చ. పరితములార మీకసుల ♦ బల్కినుకల్ గిలగొట్టుచుండనన్
సరమలఁబెట్టనేల నరు ♦ సంబున మామిడిమోకగుడ్చి చె
చ్చెర నొకకుత్తుకన్ గలసి ♦ చెల్మినిసేయక వాదులాడగన్
సరివడ దెట్టివారికిని ♦ చక్కఁగదిర్గుడు లేమలెన్నఁగన్. ౧౪

చ. చదువుల పక్కులార మనఁజ ♦ క్కెర తేనియఁ బాలఁగ్రోలి బె
ట్టిద మొసలార మీమెఱవ ♦ డిన్వెసఁజూపుచు నుండనేల నే
నెద బెదరింతయైన గొన ♦ నేగుడు నివ్వెఱనొంద నాదులన్
చదురులమంచు నిక్కెదరు ♦ చాలఁగనేర్పడె మీదునేర్పులున్.

గీ. కొమ్మగమి నెక్కి దిరిఁగాడి ♦ కొమ్మగముల
సరములనుఁ బెట్టనాయమూ ♦ సరవి నెళవు
జెఱుచువార లటంచు నా ♦ నెఱికిఁదెలిసె
నరయుజవ్వాది గందిన ♦ టంచుగనుడి. ౧౬

క. అసియెగ్గాడెడు తోయము
ననుగందపు కనుమయుండు ♦ ననుదిరుపుచు చ
ల్లన కమ్మనగొని పయ్యెర
తనమేసట గ్రంతుకొనగఁ ♦ దరుముచుఁ బలికెన్. ౧౭

క. మునువేల్పు టొడయఁడును నే
ర్పున నింతటివాడవనుచు ♦ బోసీకనుసిన్
దునుకలు మూటిని నాల్గిం
టినిఁ జేయుటవలనఁ జగము ♦ తీవిగనుండెన్. ౧౮

తే. గీ. కప్రము జవాదికడిని బు ♦ క్కాముదోడి
ముంపుచో నిన్ను నేమన్న ♦ బుద్దిని పసు
సంబు గొనవికగాలిపి ♦ సాసియున్న
కైపుసామితనికమిక ♦ గాలిగీలి. ౧౯

తే. గీ. ఔర మును బొమ్మ నీదు పొం ♦ గారఁజూచి
యొకరికొక్కరుఁ గలువక ♦ నుండునటుల
మూలకును వేసెఁగావున ♦ ముజ్జగంబు
లలరె లేకున్నముంచెద ♦ రక్కటకట. ౨౦

తే. గీ. అంటగిట్టని వేల్పుతో ♦ నరయనేస్త
మాటవల్లను నిక్కువ ♦ మతనిగొనము
పైరసీకబ్బె నాబలా ♦ వలిపిరికిని
నట్టువనుమాటఁ బోనాడ ♦ నాయమేర. ౨౧

ఉ. చట్టనపీనుల న్వినుము ♦ సారెకు సారెకు కన్నెనందులో
దిట్టరిపన్నెముం బునెము ♦ తీరు లెరుంగను నేనుదిట్టినన్
పట్టిదిగాదు నానుడువు ♦ వాలఁగునంచు దిటమ్మ నమ్మ నీ
బెట్టిదమేల కాఱులను ♦ బ్రేలెద చయ్యనకమ్మ కర్వలీ. ౨౨

మత్తకోకిలావృత్తము

రాకురాకు మటంచు నిన్నువ ♦ రాకుఁ జేయుచు వేడినన్
వీఁకగందపుతావి బూనియు ♦ వీచగానిది బాగె మ
నోఁకకుఁ గోరనుఁదీయఁబోపని ♦ గొడ్డలింగొన నెందుకో
సోకుదయ్య మటంచుబల్కెడు ♦ జోలినిక్కువ మయ్యెరా. ౨౩

క. విను నిలుకడ గోరంతై
నను లేకయె దిర్వ్వాలాడ ♦ నాయంబౌరా
పెనఁసుళ్ల మునుఁగుడుపు నర
యను కనువడనట్టిబూతి ♦ మై పోదువురా. ౨౪

తే. గీ. ఎంత వేడినఁ గాని నీ ♦ కింతయైన
కనికరముఁ గల్గదాయె ని ♦ క్కముగ నీదు
క్రొవ్వణఁగింతుఁ దెలియు నే ♦ కొండవంటి
కటికపుంజనుగవగల్గు ♦ కన్నెకనుర. ౨౫

ఉ. గోరము లందజాలనిది ♦ గోకను స్రుక్కితి నూరకుండుమా
పైర బళీయదల్చకుము ♦ బాములు బాములబెట్టి నిన్నుక
డ్పారమెసంగుగాక చెలు ♦ వారెడు నీవడియొడ్డు కారుపా
లారసరాసరిస్నేరయు ♦ నారడిఁబెట్టక మిన్నకుండురా. ౨౬

క. అనిఝుటుల నాలిగాలిం
గినుకారఁగ దూటి పైడి ♦ కీల్బొమ్మమసఁగ్
గొని మరలఁదిరిగి బుద్ధిని
కనికరమూరంగ పొగడ ♦ గాఁ జొచ్చెవెసఁగ్. ౨౭

తే. గీ. పాపగమిజేని గెలిచియు ♦ పసిడికొండ
కొవ్వరము సీరువామిని ♦ కూలదియు
నట్టిమగటిమిఁ గలుఁగఁగ ♦ నలరిజగము
నిండుపయ్యెరతమి బెట్ట ♦ కుండు నన్న. ౨౮

వ. అంత నమ్మగువ వగనెగడనెగులున నిగపునట్టువను బొగడుచున్న తోయంబున. ౨౯

క. చల్లని తెల్లనివెలుఁగుల
నుల్లసమాడగను కలువ ♦ నొడయఁడు చదలన్

బల్లిదుడై తిరుగుచు వెద
జల్లెడు కాఁకలకు నదలి ♦ నయ్యనబలికేఁ. ౩౦

తే. గీ. మున్ను తనచెంకిఁ గూలఁగ ♦ నిన్నుబుట్ట
జేసెఁజేసెను పోబొమ్మ ♦ చెనఁటినుంచ
తగదనచు చంపకయె నెల్ల ♦ తరుణమందు
బ్రతికియుండఁగ జేసె ♦ నెప్పటికి నకట. ౩౧

శా. బెట్రేకెత్తఁగ వేల్పుటొజ్జచెలుపన్ ♦ వేఁగూడు దోసంబులు
న్గాట్రేనింగడు దయ్యమంచనక వీ ♦ కన్నెత్తి జేర్మొదుగుల్
దొట్రిల్లం జెలువంబు లూడినలుపెం ♦ తోబుట్టి నీ డెందముఁ
జట్రాతిందగ సేయమేలగునె చా ♦ ల్చాలిట్టి సిగ్గించుమా. ౩౨

క. పులుఁగులు వేల్పులు నీపా
లుల వెసమెసవంగ తునుక ♦ లుం జేసిన నీ
కలిమి సెడి నీల్గవేమో
తొలిఁజేసిన బాగమునను ♦ దొడి బ్రతికితివా. ౩౩

తే. గీ. కన్నెమిన్నలనే చేడు ♦ కావలంబు
లంటగిట్టని వేల్పుపై ♦ యారనిన్న
జేరికాల్చిన నలుపయ్యె ♦ చెలఁగిపజలు
మట్టియట్టను మాటలు ♦ వెట్టఁగదుర. ౩౪

తే. గీ. కొసరుతో బుట్టువింటికిఁ ♦ గోడుఁగూర్చు
నటుల గోడును నాయెద ♦ నంటనేయ
చందమామనుమిప్పుడు ♦ చందమామ
తొగలవెత బాపినటుల నా ♦ తొగలఁబాపు. ౩౫

సీ. నిక్కమాదప్పదు ♦ నీయెదమసిఁగాను
నినునింగి సిగబట్టి ♦ నేలఁజరువ

నిన్ను వక్కలగమి ♦ నెఱినెఱితిని పోను
సీపాలు లింతింత ♦ నిచ్చెతరుఁగ
చవితినిన్నను పజ ♦ సంతుల పాల్గాను
పరఁగవున్నములందు ♦ పాముగరువ
నీమేనయల్లుని నీటున్మై ♦ గాలిపోన్
నిన్నన్న కడ్పుట్టె ♦ నీరుగాను

గీ. ఓరియొజ్జలరాణితోఁ ♦ జేరిమరుని
పోరుఁదీర్చిన నడిదోస ♦ కారి నిన్ను
నంట కావల మెల్లను ♦ నంటుగావ
నేను తలవంచెదను జూడ ♦ నిన్నుమామ. 3౬

క. అంచీపరుసున కినుకన్
మించగఁ బోనాఁడితాలి ♦ మింగుండియలో
కొంచెముఁ బూనియు పొగడెద
మంచి నుడువుగమిని నంచు ♦ మడఁతి గునుపుఁగన్. 3౭

ఉ. ముమ్మొనవాలుదారి తల ♦ బొల్పగు బంగరుమేటి కుళ్లవై
తమ్ముల్మలగొంగవై కలువదాటుల ♦ పెన్వగ బాపుచుండివిన్
దిమ్మరులున్నెబాసనఁగ ♦ దివ్వెచు ముజ్జగముల్వెలుంగు చో
మమ్మతిలంగ గాచియును ♦ మమ్ముల ద్రిమ్మట బెట్టకుండుమా.

క. అనిఁబొగడు చుండుతఱిలో
ననవిల్తుఁడు కేరివింట ♦ ననలల కోరుల్
బెనుపడఁగూరిచి చెలియ
కుక్కనకును కను ♦ జూపులలరఁ గొనకొనివేయన్. 3౯

ఉ. వేసిన వేలుతోడ వెర ♦ వేఁకియొడం గడుబుట్టుచుండ తా
గాసిలి యొక్కచేడె చనుఁ ♦ గట్టులపట్టు నవేఁ బరుండి సె

బొంసుర తొల్లి కాటిదొర ♦ పొలిట నీజవ యేడఁదాగె ని
ట్లీసుల ముద్దరాలిపయి ♦ నేయఁగ నాయమయించువిల్తుఁడా. ౪౦

తే. గీ. నీలకొరులవలపులు ♦ నిలువలేక
బమ్మెకఱిపేల్పు కాఁబ్రేమ ♦ తిమ్మగలుఁగ
నోటమెఱ మేన తమతమ ♦ బోటిరతన
ములనుదాల్చిరి మే మెంత ♦ పోటుకాఁడ. ౪౧

చ. దుగినుడు నీదు బెట్టిదపు ♦ త్రోవలుఁ బోకడఁజూచి యోటి నా
లుగవియు పూవులైన యెద ♦ లోబడకన్ గరువంబెసంగఁగా
నెగులు కొనంగఁజేసితివి ♦ నీకవిగాటపు తూపులిచ్చినన్
జగములఁగాల్పవే వలపు ♦ సామిసతంబు తలంపుసేసినన్. ౪౨

క. ఓరీ నీవలెబంటులు
లేరో నీవొకడవొక్కొ ♦ లేకున్నను విల్
దారిలి యిటు మిడిసివడక
మేరటరా చెలుల నా యు ♦ మేరానేచక. ౪౩

ఉ. నెయ్యపుతేఁడ నీకు జత ♦ నెవ్వరి పోటరికాఁడు లేడటం
చొయ్యన బెట్టిదంబుఁగొన ♦ నోర్తురె పెద్దలు నేరికైన మేల్
చెయ్యఁగ మంచిదంచు మఱి ♦ జెప్పిరి చెన్నఁటిమామఁగూడి యీ
కయ్యముఁ జేయవచ్చెదవు ♦ గాయిలుఁజేరగబొమ్మ జర్రునన్. ౪౪

చ. చిలుకహుమాయి ♦ చక్కెరల సింగిడి తేటులనారి కమ్మపు
వ్వులు ములుకుల్దలంపగను ♦ పూదఱి కమ్మనిగాలి నిండు వె
న్నెలదొర వెంబడింపవల ♦ నెయ్యెడ నీమెడగూడి తుల్వలై
కలువరమందఁజేసిరి వ ♦ కావకలుంగలుగంగ నిత్తరిన్. ౪౫

సీ. అక్కఁన తెల్లని ♦ యలరు సోగులుఁగావు
సొరది సప్పంబుల ♦ సోగులివిర

తళుకైనమేన గం ♦ దపుపూఁత యిదిగాదు
పలుమారుఁ బూసిన ♦ జనుమమిదిర
కస్తురికుత్తుకఁ ♦ గై సేయు టిదిగాదు
విరివిగ రేకెత్తు ♦ విసముఁగదుర
తనరునౌదలను గే ♦ దఁగిరేకి దియుగాఁదు
వరఁగలించెడు నెల ♦ వంక యిదిర

గీ. ఔర నేకన్నెనని చాల ♦ గోరములను
బెట్టెదవుగాని యా జళా ♦ గట్టువిల్లుఁ
డనుచుఁ దెలియుము నీమది ♦ కబ్బమెనఁగు
నేతలను నేయఁజెల్లుఁనా ♦ చిలుకరౌతు. ౪౬

శా. వీఁ కన్నెల్లుగనె త్తనీరసమునన్ ♦ విల్గంట్రెడ్లై కూలు చీ
కాఁకౌ గుర్రము నుద్దులాడినను వే ♦ గ బెక్కునుస్సిక్కనా
జోకా మూడ్కని చూడ దండు లెడయా ♦ సొద్దెంబుగా బిల్వనా
రాకయ్యానకు కాలుద్రవ్వఁ గలవా ♦ రాజిల్కపై నెక్కి యుర్.

తే. గీ. మూఁడుకన్నులవానితో ♦ మొనసి గెల్పు
లేని పోటరి కాడవు ♦ లేమ లార
డములనొందఁగ నేయగ ♦ డాకబంటు
మానసులఁజేయు నీకేటి ♦ మగటిమొరయు. ౪౭

తే. గీ. ఎలమి బెక్కెము సిడెము రెం ♦ డేటఁగలువ
నీదు మావుచికాకంది ♦ నేలఁబుట్టు
గులను వేఁజేర నీకైదు ♦ వులు సతంబు
వడిఁ దొలంగుచుఁ బుడమిపై వాడిఁగూల. ౪౮

తే. గీ. నాదు ముకుర్కుర్పునను నీదు ♦ నారివిప్పి
బెదరి వాపోవఁజేసెద ♦ బింకముడుఁగు

నాదుజడజూపి నీమోము ♦ నక్కు నీ ద
ణాయఁడగు గాలి వినుఁజేరు ♦ నాచనుఁగన. ౫౦

క. ఎన్నెన్నో నుడివినను నీ
కున్నె నరెద నేలబుట్టు ♦ కుందు టదేమో
కన్నెనుఁ దిట్టినఁ దప్పదు
వన్నియ నీమేను నీరు ♦ వలె నారోరీ. ౫౧

వ. అని యిట్లు కినుకారదూఱి యక్కటికమూని చొక్కఁపుమాటల
వక్కాణింపుచు నిట్లనియె. ౫౨

క. జగముఁ గలిగించు బొమ్మకు
నోగి తమ్ముఁడవయ్యు నల్ల ♦ యొడలిదొరకు మే
లగు కొడుకవయ్యు నీ ము
జ్జగముల వలపందఁజేయు ♦ జాణవుఁగదరా. ౫౩

తే. గీ. అన్నిటుల బొగడినఁ గాని ♦ యంతకంత
కలరి వలపులరాయఁడు ♦ కలువ తేఁడు
కాఁకులనుఁ బెట్ట వెఱగంది ♦ కనికరమున
చెంతనుండెడినే స్తవు ♦ చెలికి ననియె. ౫౪

ఉ. వాలుగడాలు ఢాకకును ♦ వాలెము నాదిడు తేటి మూకకున్
వేలుపు బువ్వ కాఁకకును ♦ వీవలిరాకకు సారెరేకకున్
బూలబిడారు జోకకును ♦ పొల్పఁగు జిల్కల నాకుకూకకెం
తోలలిమించి కాఁక తులఁదూఁగెను నే నెటులోర్తునే యిటన్.

క. హెచ్చరికఁ గాలి వీచెను
నచ్చలమున మరుఁడు నేచె ♦ నాకసమున చం
దెచ్చె చెలరేగ గాము
చ్చిచ్చొగినిటఁ గూడెనేమి ♦ సేయుదు చెలువా. ౫౬

వ. ఇట్లు మతకరి వేల్పురూపు తన కనుంగవకుఁ దోఁచి మఱియు చెలువ కిట్లనియె. ౫౭

క. నిక్కి చనుఁగంటలుబ్బి ప
టక్కున లలితైకపికిలె ♦ రవరవరింగుల్
స్రుక్కినల కొప్పుఁజాఱెను
గ్రక్కసమున పోకముడి బి ♦ రానను వీడెన్. ౫౮

ఆ. వె. అనుచు కల్కియుల్కి ♦ వినఁబల్కె చెలికి తా
తావిపూవులలరు ♦ తీవెయింట
పట్టుపాన్పుపైన ♦ పట్టుదప్పిన కీలు
బొమ్మవగిది వ్రాలె ♦ పొంకముడిగి. ౫౯

ఉ. వ్రాలినతోడనే చెలులు ♦ వారని ప్రేముడి మేరటిల్లఁగా
పూఁనురంటి వీచుచును ♦ పువ్వులు కస్తురి కప్పురంబు మే
ల్గా్రిలు జవాదిమైనలంది ♦ క్రన్నరకొంతనుఁ బోవఁజేయు మేల్
నీలిసిగల్ మనన్వలవ ♦ నింగడు సేసిన కుబ్జచేడెయున్. ౬౦

క. కనుగవ విప్పుచు నల్లడ
లనుగన్గొని మైవడంక ♦ లంపటమున మో
మున చెమట చెమ్మరింపఁగ
దనసకులనుఁ జీరి మఱి వి ♦ తాకునుఁ జెందెన్. ౬౧

వ. జెందిన నమ్మలక్కలొక్క చక్కటి కేతెంచి చిక్కుబడియున్న యక్కొమ్మం జూచి చెక్కుచెదరి యొక్కరొక్క రొక్కరొక్కరి మొగంబులం జూచుచున్నంత నొక్క టక్కులాడి యక్కలికి గ్రక్కతిల్ల మొక్కచెడిన తోడిజోటులతో నామాట పాటించు డని యిట్లనియె. ౬౨

ఆ. వె. అలమటించనేల ♦ యతివలు వినుడి యీ
చెలువ చెలువ మలరు లలరుఁదోఁట

లోఁన ద్రిమ్మరిల్లఁ ♦ గా నింతఁగల్గెపో
దీనికేమి వితము ♦ తెలియఁగలరో. ౮౩

వ. అనిన నొక్క మచ్చకంటి నెచ్చెలులతో నిట్లనియె. ౮౪

క. ఓసకియలార యడవిపి
సాసి చెలియమేను సోకె ♦ సరికన్నయ్యాన్
వేసదివి బొట్టుఁ బెట్టెద
నాఁ సరియన నిచ్చపడిరి ♦ నాతిరతనముల్. ౮౫

వ. ఈతీరునఁ బొట్టుఁబెట్టి తెలివిడినేసిన లేవకున్న నొక్కచాన జాణ గాన జాణలగు లతకూనల కందఱ కిట్లనియె. ౮౬

క. పుం డొకటి యున్న మం దొక
టిండాలుగఁ బెట్టెనన్న ♦ శేవను నవలా
కుండువెత రొకటి మన మిట
నిండారఁగఁజేయు టొకటి ♦ నీతకములచే. ౮౭

ఉ. హెగ్గడికత్తె లప్డు వల ♦ హెచ్చిన కుబ్జనుఁ జూచి జంకునన్
దిగ్గనలేచి మంతనము ♦ తెల్విడికై మఱి లేవనెత్తుచున్
బిగ్గఁగ కౌఁగిలించి విరి ♦ వింగల చెక్కులచేత నంటి నీ
యెగ్గతమాడువక్కణము ♦ లేమొయొయూరియొయూర మొప్పఁగ౯.

తే. గీ. తెలుపు దెలిపిన నీవగ ♦ దీరునమ్మ
దలఁచియుండిన దాని చే ♦ తనుఁకు గలుఁగు
నమ్మ లోలోన కుముల నా ♦ యమ్మ కొమ్మ
కతనుఁ జెప్పుము వన్నెబం ♦ గారుబొమ్మ. ౮౯

తే. గీ. పసిఁడికిని సరదుఁగలమేయి ♦ పసలుఁ జారె
పసితనంబున కెదలోన విసుకుఁ గదిరె
తొఁగలవిందును బోలిన ♦ మొగమువాడె
తొఁగలనొందఁగఁ జెప్పవమో ♦ తొఁగలకంటి. ౯౦

13

సీ. దొండకెమ్మోవి నీ ♦ దండకు చిలుకలు
జేర మేల్చదువులఁ ♦ జెప్పవేల
నలమ్రబ్బు కీల్గంటు ♦ నమిలి పులుంగుల
జేరి చిందులుద్రొక్క ♦ జెప్పవేల
యసలుపుట్టుఁగుకంటి ♦ వెసతెలిపిట్టల
జేరి మేల్నుడుకలఁ ♦ జెప్పవేల
చిగురాకుబోడి నె ♦ చ్చెలిమి కోగిలగుంపు
జేరి మేల్నొరములఁ ♦ జెప్పవేల
గీ. విరియఁబారిన పిరజాది ♦ విరుల పొగడ
పొన్నగేదఁగిమల్లియు ♦ మొల్ల జిలుఁగు
గన్నెరులపూల సోగుల ♦ కారుకౌరు
మొగుల కీడఁగు కీల్జడ ♦ ముడువవేల. ౯౦
సీ. రంగుమేలిమి మేన ♦ బంగరుసొమ్ములు
బెట్టక నీ విట ♦ బెదరనేల
చిన్ని మొగంబున ♦ వన్నెకస్తురిఁబొట్టు
దిద్దక నీ విట్లు ♦ త్రిక్కుటేల
కుతుకసారంబున ♦ కుతికెలఁ బడవీనె
సారెలగీటవు ♦ సరమదేల
తియ్యన కమ్మనఁ ♦ దేరిన నుడువుల
మాఱోడ నుడువక ♦ మసలనేల
గీ. గందమును వచ్చకప్పుర ♦ మంచుముగను
చేయు దమ్ముల నక్కున ♦ జేర్పవేల
లేచి పూపొదరిండ్లలో ♦ లేను తొగల
మేలుగా గూడి నడువ వి ♦ దేలఁ గోల. ౯౧

ఉ. ఓరుచు కొమ్మగోడు లెద ♦ నొయ్యన పూవులమాలె లక్కనన్
చేరుచు కొమ్మలో దలంపు ♦ చెల్వపుచేడెల కెల్లం దెల్పెడిన్
దారిచి పూలవిల్తునకు ♦ దక్కవకారులం జెప్పి నిల్వంగా
నేరుపు జాలకున్న విను ♦ నెవ్వగలు న్మది నుండునో చెలీ. ౯౩

క. ఇటువంటి గుట్టు లున్నను
కటకట మాతోడం జెప్ప ♦ కను నీ విపుడె
చ్చటనైన నుండు దానవొ
తటకున వివరింపవమ్మ ♦ తళుకులబొమ్మా. ౯౪

తే. గీ. అనిన తా విని తలవంచు ♦ కొని యొయారి
కాలు చిటికెనవేల్ గోర ♦ నేల వ్రాయు
చును కనుంగవను కన్నీరు ♦ చనులదంట
కొప్పారంబులం బడంగ వా ♦ కొనె ముదుంగు. ౯౫

ఉ. చక్కరవింటివాని పెలుచ ♦ న్గలువన్ దగు గట్టుం దాల్పరిన్
జొక్కలుమీరునట్టి నుడి ♦ చొప్పులుం జెప్పి బిరాన వాని నా
చక్కికి వచ్చునట్లుం గను ♦ నయ్యన జేసెదనంచు నేగిరా
దక్కెను తుంటవిల్తు బలు ♦ దాడికి గుందితి నెట్టులో చెలీ. ౯౬

తే. గీ. అందలేనట్టి మ్రానుపం ♦ డంపబోవు
మాడ్కి కలుముల పడంతికి ♦ మగం డనంగ
వెలయు ముప్పొకలానినే ♦ విరిలకోరు
కాని పోరున గవయంగం ♦ బూనుకొంటి. ౯౭

తే. గీ. ఎవరు నాకోర్కి దీర్ప మ ♦ ఱేంగగలరు
ఎవరి వేడుదు నిచ్చట ♦ నేలికైన
చెలిమి చేడియ మిన్నగు ♦ చెలువ పద్మ
నియిటం గలిగిన నాకును నెమ్మి పొసంగు. ౯౮

వ. ఇట్లు నెచ్చెలియలతో కుబ్జ వాకొనుచున్నంత కలికి గొనంబులు గలుఁగు చంద్రముఖి యను మెలఁత యిట్లనియె. ౯౯

ఉ. సాటివలంతులీ వలపు ♦ సాగిన బెంగను బెట్టు కుందురే
తోఁటను ద్రిమ్మరిల్లుతరి ♦ తొందరలుం బడువారలుందురే
మాటికి మాటికిన్మరుని ♦ మామనుపుల్గులఁ గాడ్పుఁజూచి యా
రాటము డెందమందిడప ♦ రాకిది గల్గకఁ బోవుబెట్టులన్. ౧౦౦

శా. ఔనే యెంతలుఁ దెచ్చుకొంటివిక నా ♦ హా యేమనన్వచ్చు నీ
కీనేలన్ జతయైన జవ్వనులులే ♦ రే వారలీ వింతలౌ
వైనంబు న్వినవిన్న నవ్వెదరుతే ♦ వన్వేగిరంబుం గొనన్
గానాయంబునుఁగాదు నూరకొనుమా ♦ కన్నయ్యతో తెంచెడున్.

ఆ. వె. అనుచు వలపుమీరు ♦ నతివెకు మేలైన
నుడులు కొన్నినుడివి ♦ యుడుకు దొలఁగ
జేసి మెలఁగిరచట ♦ చెలఁగి కన్నయ్యకై
తరలిబోవు నవల ♦ తొరుఁదాక. ౧౦౨

వ. నట్లు ముగుదలు వినిపించిన వూదోటలో కన్నయ్యవలపులం బడి దిరుగుచుండె. నిచ్చోట దేవకికొడుకు కుబ్జ మువ్వంక లెగయఁజేసి కమ్మచ్చు పోసినబంగారు తీఁగమాద్రి నలరారు కన్నెక నెగాదిగ కన్నుల పండుగుగాకనుం గొనునది మొదలు జగము తండిరిడెం దంబు తామరపాకున జలకంబు లాకునంటక చెదరాడువగ కమ్మ విలుకాని పువ్వుటమ్ములకు సొమ్మసిల్లి యుల్లంబు తల్లడిల్ల నన్న తోనున్న సకులతో రాచదారిం బోయిపోయి విలుగీముఁదరి యంజొచ్చి సురతాణివింటి కై వడి పెద్దదియై బీరముగల మగలకు దాల్చుటకు ద్రేఁకయై యలరారుచున్న సింగాణికి యచ్చటిపజలు వలదువలదనంగ నారిమోపెట్టి ఖణిల్ ఖణిల్ మనునాదు నలుదె సలఁచెలరేగ రెండుగంగ్రడికలుఁ గావించె. అత్తుండంబు లన్నదమ్మ

లుచేఁగొని నచ్చోటి కాపరిపజలు వజీరులు గరువించి చుట్టుముట్టిన మట్టుఁబెట్టి రాచకొలువునకు జనుచుండఁద్రోవ కువలయాపీత మను నేనుంగును యశోదకుఱ్ఱనిఁ బరిమార్చుటకై నిలువ నయ్యాదిమస్తి గలిగి మావంతునంకియకు నిలిచె నంతకుముందు కనకతప్పెట గుమ్మటకై ముడి నగరతుడుము మొదలగు చప్పుడులచే మ్రోఁగు చుండునదియు చాణూరుఁడును ముష్టికుండు నరిష్టుఁడు మొదలు మల్లడించెడుకొలంబుచేతఁ దీండ్రించునదియును కప్పురముపునుఁగు జవ్వాదిమెలాక పూనీరుకలిపి దుమారము లేవకుండునట్లు చేసి నదియు బొడిపిరాళ్లు వ్రయ్యాలు మిఱ్ఱుపల్లంబులు పుట్టలుగోలె లే కుండునట్లు కోమలికంబుగా నుంచినదియు పడగజెండాలు పువ్వుల మాలెలతో బురణింపసేసినదియు నేలవేలుపులు రాచలు కోమ టులు నాలవకొలంబువారు నన్నికొలంబుల వారితో మ్రోఁగు చున్న నొంటియుడుగు కత్తెరనేలకుం వెన్నుండన్నతో నరుఁగు చుండ రాచమిత్తలు పురికొల్పు మదపుటేనుఁగు బరికాని యానచే నెదురించిన వెన్నుం డిట్లనియె. ౧౦౩

తే. గీ. ఓరియేనుఁగు గాచెడు ♦ కారుచదుగ
మాదెసకు నేగుదెంచుట ♦ మంచిదటర
మరలఁగాజేసి బ్రతుకుము ♦ మరలవేని
తప్పదిక చావునీకు పె ♦ త్తనముచేత. ౧౦౪

చ. అనవిని మావటీడు మురు ♦ వారఁగమీఁదికి ద్రోలినం గనుం
గొని మొలహొన్నుకాసె నల ♦ కొప్పును బిగ్గఁగఁజేర్చి వెన్నుడున్
గనలుచు తొండమంది నుడి ♦ కారము నొప్పపజల్ వినంగనం
దుని మొరు పల్లవన్ బెరికి ♦ తోడ్పడువారు బలారెయంచనన్. ౧౦౫

వ. ఇట్లు గజ్జేనుఁగునుం బరిమార్చి దాని నిడుదలై తెల్లనైయలరారు రెండుపళ్లను బెరికి చేపట్టి రాముండును కృష్ణుండును మావటిని

బీరముఁగల పజలను రాచవారిదండును మట్టుబెట్టి వచ్చుచుండ తోటిరాచ లిసప్రక్కలం గూరిచుండి పలువితంబుల మాటలాడు చుండనొక్క పెద్దమంచెయుందలి తళతళకును మాతాబిఁ గూర్చిన పట్టుతివాసి యందుపైన జిల్లేడదూది చెముఖు మాయలుదిండ్ల యెత్తుగా మెత్తదలకై నతికించిన దానియందు బసనేసి మంతిరిగము పుడమిఱేను లొనరించిన తప్పొప్పులెల్లఁ జెప్పి వాటికిఁదగిన మంచి చెడ్డలు వినుపించుచుండ నందు ముష్టికుండరిష్టుండు చాణూరుఁడు మొదలగువారున్న యెడ మరువు పరువునేలను కుప్పించి పెనువెల్లి తెరని ముజ్జగంబుల చెండు చెండాడనిలిచిన మిత్తిమిత్తి గొంగల తెరలించిన నవ్వులింత సేయుచు తాటికి నెత్తువచ్చు రూపులతో నెత్తురుఁగ్రక్కగను గవలతో నన్నేల నడ్డపాటులేకుండ పచేరంబు సేయుచున్నవారిం దరియుం జొచ్చి గట్టు గట్టుపోలిక కోల్పులి కోల్పుల మాదిరి యేనుఁగు నేనుంగు చందంబున సింగంబు సింగంబుతీరు రెట్టి బలిమిగల బలిమికాండ్రఁబట్టి మిట్టిపాటు పట్టుదలయేయని కేలున కేలుఁగీలించి కాలుకాళులం జొనిపి పడదిగిచి పేర్చియూర్చిన నయ్యిద్దరు గ్రద్దనపిరుతివక పిడికిటి బొడుపులకున్ జెదరని యొడదగలిఁగి యోరసారించి తెరలక మరల పోరలఁద్రొచ్చిన వెన్నుండు తనయేనుఁగు తొండంబులఁబోలు కేలుదంటలసాచి మగరాలవలె కటికెతనంబుగలదాయ నొడలి పిడికిట విడువక పొడుచుచు నడుగులం బట్టి నాయంబు తప్పక నడుగిడుచు నడుగులం బట్టి ముమ్మాఱుఁ ద్రిప్పి నేలపై జరిచిన మోములనుండి నెత్తురుల గ్రక్కుచు జేజెల పట్టుం జేరం జనిరి. నత్తరిం రోహిణీకొడుకు నట్లె యొనర్చిన జగంబులెల్ల గొనియాడ నందుఁడు మొదలు కొలువువారందఱు కంసుని నరసనఁ గూరుచొని చూచుచుండిరి తరువాత నిదురించి యా కటికతోఁ లేచి కొండసారంగంబు వీడిన సింగంబు చందంబున కఱటిపజలను తెగ

టార్చి కన్నయ్య సింగంపుపీటపై మల్లులు తనను కారియబెట్టక నికరంబు వదిలి సూచుచున్న కంసునిగాంచి యుబ్బబ్బా యీాదున్న గీడు నా కొరకు నా తల్లిదండ్రుల కారంజేర్చి రాచలచ్చిమి పెను ప్రేఁకను దాల్చుటకై తండిరియగు నుగ్రసేనుని చెరసాలనుంచి తన యిచ్చవచ్చినట్లు దిరిఁగెనని దాపుంజేరి బొమిడికంబుపై కేలు దమ్మిఁ జేర్చితిగిచిదలవెంట్రుకలంబట్టి నేలకీడ్చిన వాడంతకు ముందె కన్నయ్య రూపునుగాంచినంతనె బిత్తరవలెదోఁచి మోము డంబంబుదప్పి తేజులేకనుండె నతని ముట్టినంతనె నసువులవీఁడి వినువీఁడు సుగంబు జూడంబోయె వానితమ్ములును జరాసంధుడు పల్గాకి పజల నైదుకొని కాలయవనుండను తురక యేతెంచి ముట్టడించిన కయ్యంబున తీరుపాటుగావించి మధురను వదిలి సంద రంబులో ద్వారకయను పేరిటితో రాచనగరు గావించి నందు సుగంబున్న భోజకొలంబునకు పులియగు నుగ్రసేనునికి మరలి రాచలచ్చిమిని కట్టించె తన తల్లిదండ్రుల చెరవిడిపించి సుగం బుండ నొక్కనాడంతిపురిని మెత్తని సెజ్జపై బరుండి కుబ్జ చేడియ కనుదమ్ములఁ గట్టినట్లైన కన్నయ్య. ౧౦౬

సీ. క్రాల్గంటి మేటి సిం ♦ గారంబు దలపోయు
జవరాలు రూపు న ♦ చ్చుముగ నిలుపు
చిలుకలకొల్కి మ ♦ చ్చిగ మాటలో నెన్న
కన్నియ కోమలి ♦ కము దలంచు
తెలిగంటి వగటు నా ♦ ద్దికతోడఁ దూఁకొను
కప్పురగంధి చ ♦ క్కదనమెంచు
వలఁతి మేన్వలపుల ♦ వరుసనుఁ గొనియాడు
సోఁగకన్నుల మది సొక్కుదలఁచి

గీ. మగువ తిన్ననిమోము తా ♦ మర మిటూర
మునకు మెచ్చును మాటలఁ ♦ పొంతనమున
కెడద సంతోసమందు విం ♦ దేర్పడంగ
లచ్చి మొగడిట్లు తలఁపు త ♦ లంచియుండె. ౧౦౭

క. తొలఁగున్నడబడు బెచ్చె
మెలఁగున్నడు చందిరికను ♦ మేల్ మేలనుచున్
కలగున్నరుని , తలంపున
కలగు న్మేన్పడక జేర్చి ♦ యలసట నొందున్. ౧౦౮

వ. చెఱుకువిల్తుండొఱ బెటికి గఱకటిగాక కఱుకు మెఱుఁగు గొరకల కఱఁద దూరనాటినఁ బసచెడి దనయింటి చేరువకుఁ వేరువడక సొరువలుఁగల పూఁదోఁటలో సారెసారెకు దిరిగాఁడు మరుని వారువముల పారువముల గోరువంకలతో రాగిల్లు పూవులకోవుల మావుల తీవియలనుఁ జూచి కళవళింపుచు నొక రాయబారి నంపుటకు తలంపుసేయు నంతలో కుబ్జవెలందితో యాననొంది యేతెంచిన పద్మిని రాణివాసంబున కాసంతైన కన్నయ్య జాడ లెరుంగక తోడి ప్రోడలకు వీడియంబులొసంగి పొడిమిగల వేసు కల నాడుచు తెరువెఱంగె. ౧౦౯

తే. గీ. అంత పద్మిని నాచెలి ♦ యలరువిల్తు
తంద్రికడ కేగుదెంచి వి ♦ తాకునొందు
చెలువ వక్కాణమంతయుఁ ♦ జెప్పుటకును
కేలుమోడిచి యిట్లు న ♦ గ్గించె బగిది. ౧౧౦

(కందగీత గర్భ చంపకమాలా వృత్తము)

కడు॥ కటివేలుపా। గవురు। కన్నఱ। కానలగాలిమి త్తన
ల్గడ। దవురా। మనన్మొగులు గచ్చునికౌమెయి మువ్వకాడప్రే।

ముడి। నెఱితో। నెవందలఁతు। ముప్పరిపోకల తారువాడపాల్।
కడలి బసా। జగా గొనము। గైకొని బ్రోవుము కోర్కెలూరఁగన్॥

క. కఱివేలు పాగవురుక
న్నఱకానల గాలిమిత్త ♦ నల్లడవురా
నెఱితో నెవం దలఁతు ము
ప్పఱిపోకల తారువాడ ♦ పాల్కడలి బసా. ౧౧౨

గీ. గవురుకన్నఱ కానల ♦ గాలిమిత్త.
మొగులు గచ్చుని కౌమె యి ♦ ముర్వుకాడ
దలఁతు ముప్పరిపోకల ♦ తారువాడ
గొనము గైకొని బ్రోవుము ♦ కోర్కెలూర. ౧౧౩

(చతుర్విధకందగర్భ స్రగ్ధరావృత్తము)
నెలప్రొద్దుకన్నుఁగవ ♦ నిగ్గులమై
కొలమ్రుబ్బుపైరగురి ♦ గొట్టెలమిన్
గలనీరు వామియిలు ♦ గల్గు లలీ
నలవేల్పనే గొలుతు ♦ నాకలిమిన్. ౧౧౪

(ఇందు ప్రతిచరణమూదిగా చతుర్విధకందములు జనించు)
౧. ప్ర. కం. నెలప్రొద్దు కన్నుగవ ని
గ్గులమై కొలమ్రుబ్బుపైర ♦ గుఱిగొట్టెలమిన్
గలనీరు వామియిలు గ
ల్గు లలీనలవేల్పనే గొ ♦ లుతు నాకలిమిన్. ౧౧౫

౨. ద్వి. కం. కొలమ్రుబ్బు పైరగురి గొ
ట్టెలమింగలనీరు వామి ♦ యిలుగల్గు లలీ
నలవేల్పనే దలఁతు నా
కలిమిన్నెల ప్రొద్దుకన్నుఁ ♦ గవ నిగ్గులమై. ౧౧౬

గ. తృ. కం. గలనీరు వామియిలుగ
ల్గు లలీనలవేల్పనే గో ♦ లుతు నాకలిమిన్
నెలప్రొద్దు కన్నుఁగవ ని
గ్గులమై కొలప్రబ్బు పైర ♦ గురిగొట్టెలమిన్. ౧౧౭

గ. చ. కం. నలవేల్పనే గొలుతు నా
కలిమిన్నెల ప్రొద్దు కన్నుఁ ♦ గవ నిగ్గులమై
కొలప్రబ్బు పైర్ గురిగొ
ట్టెలమింగల నీరువామి ♦ యిలు గల్గులలీ. ౧౧౮

(చతుర్విధకందం)

గ, ప్ర. కం. వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి ♦ వాడిమి నెసగన్
బెరసుపజజదిపి యెలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితివి సరిన్. ౧౧౯

గ. ద్వి. కం రుసిగమిని బ్రోచి వాడిమి
నెసఁగన్ బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్
ససిఁ బుడమి కిచ్చి వెలఁగితి
విసరిన్ వరుస మనిచితివి ♦ వెసదేవరలన్. ౧౨౦

గ. తృ. కం. బెరసు పజజదిపి యెలమిని
విరివిని ససిబుడమి కిచ్చి ♦ వెలఁగితి విసరిన్
వరుసమనిచితివి వెసదే
వరలను రుసిగమిని బ్రోచి వాడిమి నెసఁగన్. ౧౨౧

గ. చ. కం. ససిబుడమి కిచ్చి వెలగితి
విసరిన్ వరుసమనిచితివి ♦ వెసదేవరలన్
రుసిగమిని బ్రోచి వాడిమి
నెసగను బెరసుపజజదిపి ♦ యెలమిని విరివిన్. ౧౨౨

(మత్సబంధము, భద్రికావృత్తము)

రార కన్నయ హాటాహాటీ
కోరిఁ జేరితిని మేరగా
గారవించి కొలఁద్రోలఁగా
మేరయారయొద నెంతురా. ౧౩

(ఖడ్గబంధం, సుగంధివృత్తము)

ఏటిబోటి మేటిలోన ♦ నిక్కనిక్క చక్కఁగా
గాటమైన నీటిబందు ♦ గట్టుదారి యేలికా
కాటితేఁబమ్మఁ గొల్వ ♦ కల్మలిచ్చి బ్రోవఁగా
గాట మిచ్చు నీటిచాగి ♦ కాహళారంగుమైచొకా. ౧౪

(మర్దళబంధము, మాణవకణవృత్తము)

మేలుగడించుము సాలున్
గ్రాలగ వక్కిహనూయిన్
మేలుగ నెక్కి హసారిన్
చాలగ బ్రోచెదుమారా. ౧౫

(కూర్మబంధము జలదవృత్తము)

కారడి మేల్ మెఱుంగు మెయి ♦ కన్నయ సిం
గారపు హాళాంన్నకొల పర ♦ గన్వెనుకన్
దారవెదాయల న్మెదుప ♦ దాఱజగా
మేరలుపాముకన్దపులి ♦ మెల్పుడుకో. ౧౬

(కుండలిబంధం, ఉత్పలమాలావృత్తము)

బంగరునక్కసాలు వలె ♦ వాటు తటుక్కన వెల్గుసామిలె
స్సంగలవారు బత్తిమది ♦ సంతసమై లలితారుచు న్మసన్
రంగ నినుం దలంచిరి స ♦ రానరి గచ్చగునున్న చిన్నిటెం
కింగొన బ్రోవుమయ్య గిడి ♦ గిల్మకిలార్చిన లేముచేగమై. ౧౭

## ద ం డ క ము

సీరామవేల్పా బయల్జేజెలుం బమ్మముక్కంటియుం దుగ్గిజక్కు ల్మొదల్గా జగంబంత నిన్నెన్నగాజాలరే కొరునీసేతలుం బత్తులున్మెచ్చగా నేయుదెల్లన్న తొల్రూపు మేన్మీనులో మిన్నవై చాలప్రాగబ్బముందోచు ప్రావేల్పునుంబట్టి వాలారుముక్కంటు కొమ్ముల్మొందగన్గుర్విన్మయాబొమ్మకున్మేలు నొందంగ వేసేసితో వేల్పులుం రక్కసుల్గూడి పాల్వెల్లినింద్రచ్చుచో నీటు తా మేటిలో మేటివై కవ్వపుంగుబ్బలిన్వీపునం దాల్చి జేజేలబువ్వ న్వొసన్గీసియుల్పంచితో, జాళువాకంటిరాకాసి, నేలన్వడిన్జుట్టి సంద్రంబులోవైవగా జన్నపుంబందివై వాని మూరాముగుత్తించి మన్నిందొలంగించి నీకోరచే నేలలేనెత్తితో, కుట్టనింబట్టి చెడ్పాటుగావింపకంబంబు నన్మీదిమై సింగమై, క్రిందుపాల్మానిసింబోలి బామందితో ల్వేలుపుం బట్టియుం డొక్కనుంజీల్చి రోసంబు పెల్లారఁగా రాబమొప్పంగ దేవల్లనుంగాచితో, గోచిబాపండవై మూడుపాజ్జల్బలిన్వేడి, నీ నేర్పునుంజూపఁగా బొమ్మగుడ్డుంగడున్నిండి మూడజ్జలం జూపితో చేతిగొడ్డంటము య్యేడుమారుల్ నెఱేన్రాయలంగొట్టి యానెత్తురుం దంద్రికిన్ బిండలినెచ్చి, రాయాదలల్ గూర్చి జేజేలమెల్పక్కికిన్ దంతియల్గట్టె పెంపందితో, చాలుగా తేలురున్వాల్గు పేరింటిరాజేనికిం బుట్టి రాకాసినింజెండి, జన్నంబునుంగాచి మేల్పాజ్జలంబుట్టు దుబ్బన్గలున్నాతిగాఁజేసి యున్నేలచూలిం గడుంబెండ్లియైమించి రాదారిలోకావరంగల్లు పాఱున్గరాళించియున్రోల్బలునుంజేరి తాసయ్యయానన్వడిన్ లంకలోఁజేర సన్నాసులుం బొమ్మచారుల్ సిరాబారులుంగొల్వగా నాకుపాకన్ దగంగొన్ని నాళ్ళుండి యచ్చోటునుంబాసియుం సీతఁగోల్పోయి తోబుట్టువుం దోడురారుస్యమూకంబుకుంజేరి రేకంటుమేపుట్టువుంజూచి నెయ్యంబు వాటించి మ్రానిమ్మరుల్ గొల్వ సంద్రంబుపైవంతెనంగట్టి రెండైదులెక్కన్దలల్ గల్గు రాకాసిసింజంపి వేవానినైదో

దునుఁ జేనిగావించి యున్నెలచూలిన్వేసంగూడియుం బుష్పకంబెక్కి
దమ్ముమ్మందునుం గొల్వఁగా వీటికై వచ్చి సంతోసమున్ మమ్మతిల్లంగ
చుట్టుందురారాయలుం గప్పముల్వెట్ట, పెంపొందియుం బత్తులంబ్రోచి
తొ, సల్లవల్వన్ మొలందాల్చియుం బైడిచూలాలిబర్వుఁ దొలంగిం
పరాకాసిపాలఁ దగంబుట్టు రారాజులం గొంతిమేపుట్టుకల్ బాసటం
గల్గగాఁద్రుంచి నేలన్ సతంబిచ్చఁగాదిగ్గకన్నయ్య వైచాలఁగొల్గంటులం
న్నెలవా చాలపాఁబ్రోవఁగా, నీవుమేల్మ్మలుఁగా బుద్ధరూపుంగడుందాల్చి
సద్దారిలో మేటివై దాయలంబోరు సందారునంగెల్వఁగా రావిమ్రా
ల్నెసిలోదూఱి ప్రావేల్పుమోయూరులం గొప్పఁగాదప్పులుం లేని
మేల్నోములున్నోచఁగాఁ జేసి యున్వారిబన్నంబులం బెట్టి మువ్వేటిపే
రింటితొల్వేల్పులం ద్రుంపగా ద్రెంపఁగా జిల్వరాదాల్పుకై బాసటన్
జూపితొ, తేజిపై నెక్కి యుండాలుమిరారంగ చెన్నంటులాతేకులం జీల్చి
నాయంబులం బంటవూఁబోఁడిపై నాల్గుహజ్జల్ వడిన్నిల్పితో, నీకడిందై
నచెయ్యుల్ దలంపఁ సురన్మత్తికై గ్రాలు నిన్నున్మతిన్గొందరున్ వేద
గుఱ్ఱేరకన్ దొడ్డుగా బిడ్డలన్గొడ్డులన్, మేడలన్మాడలన్గోడలన్జేడెలన్,
కుజ్జలంబత్తెలం గుఱ్ఱముల్ గల్గు కల్మిల్ తిరంబంచు వేసమ్మి ముత్తింగొనం
లేక నేలన్మతింబుట్టి చావొప్పఁగా వెండితాఁబుట్టుచున్ జచ్చుచున్ దుం
తరాతుండుపట్నంబుకున్ నేలకుందిర్గగా లేక నిన్నెప్డుజోగుల్ తలంపొ
ప్ప జేజేలుతొల్వేల్పువేఁగంటి చౌఁగంటి రేకంటిమేపుట్టు వాకోసనా
యందు నిర్వామిరాయందు మేల్లేటిబాబాయు కాసెద్దడింగాచు విన్ద్రి
మ్మరీడున్ మొదల్గల్గువారెల్ల విన్కొంపుజాబిల్లియున్ జక్కటుల్పక్క
ముల్సందెలున్గందు పుల్కారులున్వొద్దెలు ద్రొబ్బద్దులున్మిన్కులు న్గబ్బము
ల్గొలె నాబమ్మగ్రుడ్డంత నీవంచు వేగుండి యున్నమ్మి నీతావునుంజూచి
వేతారుచుండంగ మెల్నాటికై మేటివై యుండుకన్నయ్య నిన్నెప్డు నీ
చిన్నెలన్దప్పకన్నెంచు నాకన్నెకున్నీదు చెన్నుందగన్జూపి కావంగదె
లచ్చితేడా, జగాపక్కిగోడా జొహారుల్ జొహారుల్జొహారుల్జొహారుల్.

చ. సిరిచెలిమించుగా బొమలు ♦ సింగిడిగా బలులోతు నుద్దులో
యురుములుగాఁ జెలంగ జెలు ♦ వొప్పెడినల్లని మేనుఁ(మ
బ్బుని బరికపుసోనలం గురియ ♦ బల్మరుచేడియవానకోయిలన్
హారువుఁగ జేర(బోవుము జొ ♦ హారులు వేలకొలంది సేసెదన్.

వ. అనిసంబరంబున నక్కఁటివేల్పుం జేవగా నగ్గించి తన దేవెరి సుద్దివినం
జెప్పఁ జిలుకపలుకులకు సరుదుగల నుడువుల నిట్లనియె. ౧౩౦

సీ. వలవంతకారగ్గి ♦ వలన బుట్టినరోజు
వదలిన కెమ్మోవి ♦ వట్టవార
కాటుక నెరయుంగ ♦ కన్గవజలకంబు
కాలువలగుచు చ ♦ న్గవను బొఱి
చెక్కిటఁ జేర్చిన చేదమ్మి ♦ కాఁకచే
మోముదామర నీటు ♦ మునుఁగువడఁగ
పలుమారు ననపిల్తుఁ ♦ డలరుతూపులఁ గ్రుమ్మ
కదలనిగుండె చీ ♦ కాఁకుఁగాక

ఆ. వె. నవతమీర మోము ♦ ననుచెమ్మటలు వాఱ
తలఁపులోన నిన్నుఁ ♦ దలఁచి తలఁచి
గువ్వగుత్తి కొదవ ♦ కొన్ని మెల్లనుడువుల
నిన్నుగూర్చి చెప్పి ♦ నన్నుబంచె. ౧౩౧

సీ. ఇగిరించులే మావి ♦ చిగురులచే సొక్కు
కోయిలఁ జేరునే ♦ కొడిశలకును
మిన్నేటి నీటిలో ♦ మేలుగా దరివెను
యంచలు చేరునే ♦ వెంచలకును
చందురుమామ మేల్ ♦ చంటిరి కనుదిను
యేగునే నెల(తాపుఁ ♦ డివములకును

నీటఁబుట్టుఁగు కమ్మ ♦ నీరుఁద్రావుచు చొక్కు-
తుమ్మెదలేగునే ♦ తుమకి గమికి

గీ. నీదుబాగైన యడుగుల ♦ నీరుపుట్టు
వులను నీనవ్వు నీపాట ♦ లలరురూపు
లందె నాబుద్దినిలిచె నా ♦ కన్నులవయి
నాసఁజేరదు నీయందె ♦ నచ్చియుండె. ౧౩౨

తే. గీ. మున్నుకల్మల ప్రోయాలు ♦ చిన్నిబోర
నిలచి మనవుము నన్నని ♦ నిన్నువేడి
మరల నీ యంజదమ్ముల ♦ మరువకెలమి
కొసరి యంజల బుక్కాము ♦ గోరెగాదె. ౧౩౩

తే. గీ. వేలుపుల గాచుదేవర ♦ వితము నీవు
నిబ్బరంబున నీకేలు ♦ గబ్బిగుబ్బ
దుగలఁ దలపై నిబెట్టినఁ ♦ దొగల బాసి
నేను మనిమెదనేల బి ♦ రానరమ్మ. ౧౩౪

క. నినుఁజూచు కనులతో చ
క్కని వెయ్యివియైనఁ గాని ♦ కననోడును గ్ర
క్కున నీకని పెంచిన మే
యిని నోరులం జేర్పనోల్ల ♦ దెల్లెడనైనన్. ౧౩౫

ఉ. సింగముఁబోలు నెన్నడుము♦చెందొవరాయనిమించు మోము మే
లుంగడకంటి చూడుకుల ♦ లో జగమంతయునంకె జేయుచున్
బంగరు దుప్పటంబువలె ♦ వాటుగ వేసిహారంగుమీర నా
కుంగనుఁబడ్డ రూపుకులు ♦ కున్మతిఁ గాంచగ నిచ్చజేసితిన్. ౧౩౬

సీ. మొల్లమొగ్గలసాటి పెల్లగు పల్చాలు
బలుకెంపు మోవిపై ♦ బరువకున్న

వెడలుపుగలబోర ♦ విడి గుబ్బలంటగా
నింపుమై వే కౌఁగిలింపకున్న
నీటి పుట్టుఁగుబోలు ♦ నీ కేలుదుగలను
చెల్వైన కొప్పునఁ జేర్పకున్న
నిబ్బరికపుచూపులుబ్బగ వెల్లనౌ
నెమ్మోముదమ్మిపై ♦ నిలుపకున్న
గీ. నోర్వగా లేను నాయందు ♦ ముర్వమీర
రమ్మ రావేని యిట నీవి ♦ రాళియగ్గి
చేత నీరైన నివ్వేడ్క ♦ జేసి నీదు
నడుగుదమ్మ్మలకడఁ జేరి ♦ యుండగొందు. ౧౩౭
వ. అని యిట్లు కొన్ని నుడికారంబులగు పోలుపొందు తియ్యని నుడు
లచే వాక్రుచ్చి యక్కటివేల్పుం జూచి వెండియు నప్పద్మిని
యిట్లనియె. ౧౩౮
క. తొయ్యలి వలపులు హెచ్చిన
కుయ్యిడుచున్నంత మరుఁడు ♦ కు సిగుంపులుఁగా
తియ్యని విల్లందియు వేఁ
కయ్యానికి కాలుద్రవ్వెఁ ♦ గా కటివేల్పా. ౧౩౯
చ. సరవిఁగ వెన్నెలంగనిన ♦ జక్కవతీరుకడిందిమబ్బు పెం
పరసిన తూడుతిండిపరి ♦ నక్కట బెబ్బులిఁగన్న లేఁడిమా
దిరి కడి పూలసెజ్జపయి ♦ తీఁగయొలుఁగున కాఁకనొందెనా
విరిహాదనందు దొట్రిలెను ♦ వెచ్చలకాకల నోర్వలేమిచేన్. ౧౪౦
క. దక్కినపుఁ గాలి వీఁవఁగ
పక్కులు వగఁగలుఁగ గూయ ♦ వలదోర నెలలుఁ
స్రుక్కఁగనేసిరి చీమచి
టుక్కనినన్ నీవటంచు డొంకుచు చూచుఁ. ౧౪౧

మ. అనలుం బుట్టుగునం బరుండె నెల చె ♦ ల్వారంబో గల్గిక్కె డా
ల్పన తెల్పుఁ మత్తెపుఁ జాలుమై కళుకు మేల్ ♦ బంగారు తీవే మొ తె
ల్పెసలారెన్ సరులెల్ల దమ్మిఁ మొగమౌ ♦ యుం దాకగాఁ గ్రుక్కె నీ
మనవల్పందిన గాదె హావడాల వే ♦ మారుం బడెన్గన్న యా. ౧౨౨

క. అని హాయలుఁగ నచ్చెలి సు
ద్దిని వినగాఁ బలుక నల్లఁ ♦ దేవర యొలమిన్
బెనగొనగ చెలువతో వ
న్నె నగల నడికారమడివి ♦ నంబలికె మనన్. ౧౨౩

ఉ. మాపటి ప్రొద్దు గ్రుంకవిను ♦ మా చెలికానినిఁ గూడి నేడు నే
నా పె బిడారు జేరముర ♦ వారఁగ వచ్చెదనంచు దెల్పుమా
చూపరి పూలవిల్తునకు ♦ గ్రుక్కక గట్టితనంబు బూని తా
దూపిలియున్న వద్దమున ♦ తొయ్యలి మేల్రతినమ్మ గ్రద్దనన్.

క. అని పలికి పోవఁబనిచిన
ననఁబోణికయి నొగ్గిడి ♦ నలమేన్దొరకై
గునపు నగిడి గిల్లిడి గ్ర
ద్దన చెల్మి పడంతియున్న ♦ తావలమునకై. ౧౨౫

ఉ. వన్నె యొయ్యారివచ్చి ♦ చెలువంగని ముందటనున్న తీరులే
కున్న వితాకునొంది వెలి ♦ గొందియు కన్నుల తెప్పవ్రాల్పకే
కన్నియనెల్లఁ జూచి సర ♦ గన్నరసంగల ముద్దుగుమ్మలన్
బెన్నుడి వక్కణించుమని ♦ వేకుఱుఁ జేరిన నందటొక్కయై. ౧౨౬

తే. గీ. వరుస వాళొనిరప్పుడు ♦ వడఁకిమిన్న
కరయుఁ జిగురాకు బాకువా ♦ డనెడుఁ బూని
పోక నెడలోన సెకసేరి ♦ గ్రుక్కి గోడ
గములపాలయి యడిగోలె ♦ కన్నెమిన్న. ౧౨౭

చ. కుడువదు వంటకంబు నెఱి ♦ కొప్పునఁ దాఁవుల పూవుసోఁగుల
న్ముడువదు రామతమ్మలటు ♦ మ్రోలనుఁ జేరిన నాకు సుద్దుల
న్నుడువదు పూలతోఁపునకు ♦ నుం జెలిమూకలఁ గూడియాఁడఁగా
నడువదు గొప్ప యబ్రములో ♦ నర్చిన నవ్వది కేమి సేతుమో.

ఉ. విప్పదు లోవలం గలుఁగు ♦ వేసట నెమ్ములకెల్ల చిందులన్
జెప్పదు మోముఁ దమ్మికయిఁ ♦ జేరఁగవచ్చిన తేటి మొత్తము
న్రొప్పదు నీరునుం గొనదు ♦ రోయును కోయిలపాఱుకుం గను
ల్ద్రిప్పదు నల్ల మేనుఁగల ♦ దేవర వచ్చెడు త్రోవఁజూచుటల్. ౧౨౯

క. ఈ రమణ నిదుర లేకయె
సారెకు నిటురట్టుసేయు ♦ సాగెనుఁ బలుకన్
మారాడదు మముఁజూడదు
పేరిమితో నెపుడు నిన్ను ♦ బేర్కొను పడఁతీ. ౧౩౦

క. అని పసఁగుఁ జేయు చెలిములు
వినుచు నుడులనాలకించి ♦ పెనుతోయముగాఁ
గనుమారాడక దనపే
రును వినఁబలికినను వీడె ♦ ప్రోయాలు వెఱిఁ. ౧౩౧

తే. గీ. కన్నుఁదమ్ములఁ దెఱచిన ♦ ల్గడలమిన్న
నెల్లఁబరికించి యొద్దలో ♦ నల్లటంబు
నివ్వటిల్లఁగ నచ్చటి ♦ నేస్తపుఁ జెలి
మానికంబునుఁ గనుఁగొని ♦ మాటఁబలికె. ౧౩౨

చ. కటకటనన్ను నిట్లువల ♦ కాఁకను సందరమందు ముంచినీ
వెటకుమిటారి యేగితివె ♦ యెక్కుగణిన్ మరులుం దోలంగునె
చ్చటఁజొరుదు న్బిరాననను ♦ సారెకు కౌఁగిలి నీయవెన్నఁడె
న్నటి తరివచ్చునమ్మ విన ♦ నాదగుగంగఁ జెలంగనెల్తుకా. ౧౩౩

ఉ. వెన్నుని చెంతనాకుఁగల ♦ విన్నదనంబును విన్నవించితో
క్రన్నన నిన్ను నేమనుముఁగ ♦ న్నని పల్కకమోన పోతివో
విన్నది కన్నయట్లు వినుపిం ♦ చితొ నీదగురాయబారమో
యన్నులమిన్నఁ జెప్పవగు ♦ నచ్చొటఁగల్గిన వింతయేర్పడన్.

సీ. అని కఱివేల్పు పొం ♦ దున కయివెతలకు
పాదైన కుబ్జనాఁ ♦ బడఁతిఁజూచి
బద్మిని యిట్లనిఁబలికె ♦ కన్నీరుము
న్నీరుఁగాఁ జేసియు ♦ నీటుకాటు
కనుఁగడుఁగఁగ నేల ♦ కడువేడియూర్పుల
వలన పూసోగులు ♦ వాడసెజ్జ
బోరలఁగా నేరని ♦ పోడిమి విడనాడి
గబ్బిగుబ్బలఁ బూయు ♦ గందములును

గీ. చెదరిపోడిఁవ్రాలఁ ♦ జెక్కిటఁ జేయిఁజేర్చి
మోముఁ దామరవన్నెలు ♦ మొఱకవడక
చెఱఁగు ముసికిడినిట్టుల ♦ చెల్వ కాని
కొఱకు కుందంగ నేటికే ♦ కొమ్మమిన్న. ౧౩౫

క. అనితానుఁబోయికన్న
య్యనుఁ గన్గొని ముచ్చటాడి ♦ యానతిగొనివ
చ్చిన ముచ్చటంత చెలివా
కొని నెలఁతకుఁ దెలిపెఁబూస ♦ గూర్చిన మాడ్కిన్. ౧౩౬

వ. అంతమచ్చకంటితో నిచ్చగా కొన్ని ముచ్చటల మచ్చికగా ముచ్చ
టించి మఱియు. ౧౩౭

చ. తెలిసితిఁగాని నీవలపు ♦ తెమ్మరవేఁవ మరుండుకిన్కతో
నలరుల కోరులేయ చెలు ♦ వారగ కోయిలజిల్క సారెపె

ల్లలమటఁ నొందగా రొదలు ♦ హాళిగసల్పగ సైపలేవునీ
చెలువలఁగూడి మేడకిక ♦ జేరఁగబొమ్ము పరాకుపొల్తెనా. ౧౩౮

తే. గీ. ఇటుల నేస్తపుచెలిబల్క ♦ యింతి మిన్న
చెల్మిపడఁతుక చేదమ్మి ♦ చేయిదమ్మి
నిచ్చిపయ్యెట సవరించి ♦ యొలసిమీర
నంచనడకల కొయ్యార ♦ మెంచనడచి. ౧౩౯

ఉ. మేడకుఁ జేరఁబోయి చెలి ♦ మిన్నలతోఁ గొలువుండు నంతలో
వేడుక కొఁడు నల్లమెయి ♦ వేలుపుకొండొక చేడెఁజీరి తా
వేడిమిఁగొన్న కుబ్జకును ♦ వేళముగానిదె రేయివత్తు నం
చాడినగోల సంతిపురి ♦ నాయమ వీడియు మిత్తమించగన్. ౧౪౦

ఆ. వె. వెన్నదొంగ యూన ♦ వినివచ్చి కొలువున్న
చెలువకఱుఁదు బుట్ట ♦ చెలిమిగలుఁగ
వేల్పుప్రోడఁ జెప్ప ♦ వివరము కొరును
దెలియఁజేసి యేగె ♦ తెఱవమిన్న. ౧౪౧

వ. ఇట్లుఁ దెలియునంత నావగలాడి వగకాసికై, మిగుల వగలఁబొగిలి తనలోన. ౧౪౨

ఆ. వె. ఎపుడుఁ బ్రొద్దుగూకు ♦ నెఱచి మేపరిగొంగ
నెపుడుజూతు వలపు ♦ లెపుడు దీర్చు
నెపుడు చందమామ ♦ యేతెంచునో కద
యనుచు పలువితాల ♦ నరయుచుండె. ౧౪౩

వ. అట్టితోయంబున. ౧౪౪

(సూర్యాస్తమయవర్ణనము)

తే. గీ. వెనుకదెస సీమమేడపై ♦ వేడ్కమీర
రేవెలందుక మెచ్చుతు ♦ రీన పసిఁడి

కుండసేసియు క్రొప్రపు ♦ కొనలనుంచె
నోయనంగను చీకటి ♦ దాయ వెలిఁగె. ౧౪౫

క. వడమర కెలఁకువడంతికి
కడువడితఱి బొజుఁగుకాఁడు ♦ తలిరుల కెంపుల్
విడివిడిఁ గూర్చిన బంతిని
తడయకఁ బాంపెనన కలువ ♦ దాయుఁడుఁ గ్రుంకెన్. ౧౪౬

చ. వలకులు నెఱ్ఱవాతె చెలు ♦ వంబులు తామరలందుఁ దీరె పు
ల్గులగమి చెట్లఁజేరె నెల ♦ కూటిపులుంగుల సేదఁదేరె బల్
కలువలరోకు మీరె నెల ♦ కల్లులదాటుల నీరులూరె చు
క్కల తెగగేరె కమ్మవిలు ♦ కాఁడులకోరులనూరె నత్తరిన్. ౧౪౭

ఉ. పేరిమితమ్మితేని వల ♦ పింపగ వెన్దెసయన్వలంతి సొం
పారినఁ చీరఁదాలిచి యొ ♦ య్యారపుఁ జేగురువారు కెంపులన్
గూరుచు సొమ్ముఁబెట్టుకొని ♦ క్రొత్తనిజాజుల కొప్పుబెట్టినో
నారహిమీర నేలయెఱ ♦ నైనెఱసందెవెలింగి జొబ్బిలెన్. ౧౪౮

తే. గీ. తుంటవిల్తుండు బొజుగుల ♦ తుటుముగరువ
మణపనన విల్లునెత్తిన ♦ యలరు బెళుకొ
తేరునకుఁ గట్టుచిలుకల ♦ తేటుముక్కు
నీటుచాయల నగనొప్పె ♦ నీరుకాళ్లు. ౧౪౯

చ. కలువబొజుంగునా తెలిమె ♦ కంబుల రాయఁడు వేడ్కఁ బుట్టుగు
బ్బలిగ వినుండితేచి తన ♦ వాడివెలుంగగు చేతిగోరులన్
నిలువక చీఁకటేనుఁగును నెత్తినఁ ♦ గొట్టిన త్రెల్లిరాలుని
గ్గులుగల ముత్తియంబులను ♦ కోపునచుక్కలువెల్గె తళ్కునన్.

చ. విరివిడిఁ బాఱి గుబ్బలిగ ♦ విన్నెఱితావులఁ దూఱియుండి బి
త్తరమునుఁగల్గు ప్రొద్దుతురి ♦ తంబున గ్రుంకుడు మెట్టుఁజేరిన

న్పొరిపురివెచ్చ గాండ్రకును ♦ మ్రుచ్చులకానలుఁ బుట్టఁదట్టగా
నిరులట నిక్కిపిక్కటిలె నేప్పడ ♦ నేరకవ్రంత మిట్టలున్. ౧౫౧

మ. వెలియింతైనను లేక ముజ్జగములుం ♦ పెంజీకటుల్గ్రిమ్మ న
త్తలలోనన్ గొమరాండ్రొగిన్మొగలతో ♦ దార్కొణఁగా పూలసె
జ్జలపైఁ గూడి పరుండనేసి మసహె ♦ చ్చన్ మిండలంజేరి గ్రం
తలహోయున్మరు చెయ్యివలన్మలఁగియుం ♦ తం బోయి రిల్ జేరఁగన్.

సీ. మరుఁడు దెరవరుల ♦ మది కొనలం గాల్ప
కుప్పఁగా నిల్పిన ♦ నిప్పులనఁగ
విటకాండ్రపై దాడి ♦ వెడలెడు వెడరాఁయు
గ్రొల్లైనపై షాణ్ను ♦ కుండయనఁగ
వలపుకాండ్రను మెక ♦ ములపైన వేఁటాడ
దెచ్చిన ననవిల్తు ♦ దీమమనఁగ
వలజేఁడు వలఁగల ♦ వారిగాఁ తనుతీఁగి
యలఁ ద్రెంపనెత్తిన ♦ యలరుగుడుసు

గీ. వాలనఁగ యెఱ్ఱదనమయి ♦ వన్నెనున్న
వరలి తేజులఁగలదియై ♦ వట్రువయయి
పొడుపుగుబ్బలి కొప్పుపై ♦ బొడిచెనిండు
జాజు లలరిన చందురు ♦ డోజఁగలిగి. ౧౫౩

ఆ. వె. చందమామ యాక ♦ సము నెక్కఁ దెసలను
వెల్లఁదనముఁ గలుఁగు ♦ వెలుఁగు లేరు
పడియె నలువగ్రుడ్డు ♦ పడిగ నిండినకప్పు
రంబు క్రోవివసగ ♦ నంబడియెను. ౧౫౪

వ. మఱియు నపొడుపుకొండనుండి కొమారుండుఁ బుట్టిన వేఁడుకను నాకసము నొరయు తరఁగలచే మమ్మలిల్లు పాలసందరంబు వెల్లి వొడిచి పుడమి కడువడి యెల్లెడల నల్లుకొనియెనన నంతకంతకు

లెక్కలేనిదియై యెనిమిదికడల నలుమఁబడి మిన్నేటి సెలయేరులనుండి పైఁడిమూఁకాలి వలంతికిం డిగ్గురాయుంచల సోఁగుల సూదిరి తగ్గులేని పుటపుటనవిచ్చిన తెల్లఁగలువల ప్రోఁగులుం గల కేళాకూళులం జెంగటను పొదలాడుచు తెలగాముపామియును గవియుంను జొప్పుట యబ్బెసంబునుంబోలె మేడలదాపు నురతాణికతనంపు గుంట్రకని కిటికీలందూఱుచు చీఁకటి క్రొక్కారుతుద యగుటవలన తెల్లు పెంపారి పూచెనోయన విరివిఁగల వెల్లువల నొడ్డులం గ్రాలుచు నసలచాలుల పోలిక నేలపుట్టుఁగుల తీవియల యాకులం దళతళరువాణంబుల వెలయుచు కొదమసింగపు కూనలతీరున క్రొండకొప్రంబులెక్కుచు మనఁజెలంగ జలకంబునం దేలియాడు వాలుగల మేలగు బెళుకులంబోలి సోయగంబున నందంబుగల పెన్నిటితరగల చెలువారి యులచందిరిక మిక్కిలి గరగరగల తెల్లని చెన్నుగలదియై వెన్నెలపులుంగుల నోట నెరయుచు చందమామసీములోఁ గల తేటివాయినుండి నెమరువేయుఁగ జారిన మిక్కిలి మమ్మతిల్లు నురుగుపుంజిక వరుస నేర్పాటుగల పువ్వుటీరంబులపయిం దిరువులాడుచు కమ్మనితావి వెకజల్లెడుననుచు మల్లెపూగుత్తుల సంతోసంబు రెట్టింప సిట్లట్లు తొలుదొల్త కూడికచే నలసి వలపుకాండ్రను నీసడించి పైకూటమి నెఱపు తెఱవలఁ నుగయుజాయచు న్నరువాణంబుల తెఱంగునన్ కురంగట కరంగి తొరంగు నెలకల కట్టడంపునేల జలజలం జాఱుచుండు వెల్లఁ దనంపునీటి తళుకుక్కులం గలసి కూడుకొనుచు రింగున న్నెగసి వినుదారిరంగారు నేల కొడుకుగాముపగడంపు రిక్కలు గోలెగాములు రిక్కలింగంబులని గుటుకు గుటుక్కన మ్రింగ గడంగుతఱి పెద్దగా గురియుమనుచు వెల్లువ వరుస నీటి దారకు నింపుగా గుంపులై యాకసంబున కుత్తుకకొలఁది ద్రావి

క్రిక్కిరియన్వ్రాయిం బట్టి యొక్కటి కొక్కటి కందిచ్చుచు విచ్చలవిడిన మచ్చికలం గలయు నెలఁత్రావుమల నొయ్యారంబును నాలుమగలు పటికపుకోరల నొ్మ్మదలుంచిన నారికడము కల్లునా నచే బుచ్చుకొని దాని రిమ్మవలన గలుముకొన్న సంతొసంబు సందడింప వినువారి వీనుల కింపగునటుల బాడు నెక్కువతక్కువ పాటలచేత డబ్బాటుమాటల నక్కజంబు పొందించు నాటలచే వంకరలగు రూపుసేతల లలించు వైనములేని చిరునవ్వులం జెలంగి మెలంగుచు తెలివంటి పరాకువదిలి మరులుఁజెంది నొకరి కొకరు ప్రేముడిసేయుచు రతనపుటందియలు మ్రోతమ్రోఁయఁగా పుప్పపు పెద్దతుప్పలకుం జోయి తోటనుండు కమ్మ తెమ్మరలు వీఁచి, కుతిసీపయ్యెదలు దొలంగింపకయున్న జారిపోవ న్పసుపు పచ్చని నిమ్మకాయలవడుపునం బొంగారు లేకులుకుగుబ్బ గవలం దళతళలాడునట్లు గాన్పించు సొగసైనపొడ లుబ్బుకొనం దబ్బిబ్బ లెడలం దబ్బున కౌగిలించు మెఱుఁగుఁబోడుల కన్గవలకొనల గద లుచున్న మెఱుంగులు రాణించు సింగారపు సేతలకు సంతసించు ప్రేముడి మగలతో పెనుగులాఁడి పలువితంబుల కూటములన్ గల నేరుపులతో చేరి మరునిదురంబున నయ్యాటలాడి తారు చుండు నవ్వాడు సోయగంబుచే తళతళక్కుమని గ్రాలెడు మగ రాలదుద్దుల పాపెటఁ బొట్టు చకచకలతో చెలిమిసేయుచు నిట్లు తగ్గులేని తెల్లని చాయల నిండుకొని మెండుగా పండువెన్నెలలు గాయుచుండ మరుండు కరంబుగా విరికటుకుటమ్ముల దురమ్ము సేయ కినుకొరదాయనై కమ్మతెమ్మెరలుదాయ నుల్లంబు జల్లు జల్లుమని తల్లడిల్ల సిద్ధురనొందక మిగుల మొత్తని జిగురుపాన్పు నుండి డిగిచెరలాడు పెనుగాలిచే దూలి పూవతీఁగియమాదిరి సోలుచు కుబ్జకన్నె కపతనంబు నతంబు మంతనంబున తలంపు

సేయు సిరిపెనిమిటియగు కన్నయ్య యొడలి సింగారంబు కన్నులఁ
గట్టినట్లైనఁ జూచితి చూచితని జుఱ్ఱునలేచి బయలం గౌఁగిలిం
చుచు నది వట్టిదియైన కళవళించుచు నక్కటక్కటా మూల
దైవంబు కట్టడియయ్యో నేనేమి సేయుదుననుచు కన్నుంగవనుండి
జారుచున్న నీరు సెలయై యలర గడగడ వడంకుచున్నంతలోన.

ఉ. అప్పుడు నల్లమేనిదొర ♦ యూరటనొందెను కుబ్జచెంతకున్
దెప్పునఁబోవఁగాఁ దలఁచి ♦ తీరగుసొమ్ములుఁ దాల్చి మేననీ
టొప్పఁగ యుద్ధవుండనెడు ♦ నొక్క నిమిత్తనిఁ గూడిచేడెమే
లుప్పరిగంబుత్రోవ చెలు ♦ వొందగ నాతఁడుఁ దీయుచుండగన్. ౧౬౬

క. చనిచని కట్టెదురంగను
గొనెమరునిం గన్నతండ్రి ♦ కోల్కొను సొరము
ల్దనలారు వీనెవిద్దెన్
జిగిరవల వెలుంగుగద్దె ♦ చెలువఁగు మిద్దెన్. ౧౬౭

వ. కనిలోఁ గిలికింజనిన నచ్చేడియ యెదురుఁగా నడచి హరుసంబు
బుద్దిలో బెనంగొన నక్కటివేల్పునంజదమ్ముల వన్నెటి జలకంబు
నంగడిగి సన్నని దువ్వలువచే దడియొత్తి నిద్దాబంగరు రతనాల
గద్దియపైఁ గూరుచుండబెట్టి వెంబడించివచ్చిన యుద్ధవుండనెడు
నేస్తకానికిఁ దగిన పూజలొనరించి దురబందులు మొదలగు
మేలోగిరంబుల సాపడంబెట్టి నెచ్చెలులతో నచ్చెలువ యూర
గించి మరియు, ౧౬౮

క. జవ్వాది కప్పురపుకడి
నివ్వటిలం జెమ్మలందు ♦ నెఱివివ్వలతో

మవ్వముఁగల పడుకఁగదిన్
జివ్వన కరివేల్పుతోడఁ ♦ జేరెఁజెలువయున్. ౧౫౯

వ. ఇట్లు నప్పడుకఁగది మ్రోలకరిగి వెండియు, ౧౬౦

చ. పగడపుకోళ్ల మంచమును ♦ బల్కులతి నీపనిమించు పాన్పుపై
నిగనిగలాడు దోమతెర ♦ నిక్కఁగచక్కని నిల్వుటద్దము
ల్సొగసగు మెత్తలుఁబ్వొరుల ♦ సూదినిచందువ ముత్తియంపుచే
ర్లుఁగలిగి తేజునొందులలి ♦ లోఁగిలికింజని చూచిరప్పుడున్. ౧౬౧

సీ. మంచిగందపుకోర ♦ మరిజాలవల్లిక
వట్టివేళ్లసురంటి ♦ వన్నెగదుర
జవ్వాదివక్కణి ♦ సంపెంగినూనె గిం
డులుఁబిల్లిగడ్డలు ♦ తళతళమను
సిరిమించు రతనాల ♦ చిలుకల దివ్వెకం
బంబులు కప్రపుఁ ♦ బరణివచ్చి
కస్తురిపెట్టెయు ♦ కాళంజికడిగల
వన్నెఁటెక్రోవియు పసిఁడిపీణె

గీ. బలితమగునేన్ను వలఁతోటి ♦ పనిదనర్చు
దువ్వెనక డానిచెంబులు ♦ నివ్వటిలిన
పడుకటిలుఁజూచి కన్నుల ♦ పండువైన
వచ్చరామెట్లుఁగలపూల ♦ పాన్పుఁజేరి. ౧౬౨

శా. దయ్యంబౌకఱివేల్పు కుబ్జయెదనే ♦ దందీరకేల్దమ్మితో
నొయ్యారంబు నకౌఁగిలించి తమితో ♦ నోజన్నునుం బల్కులన్

వెయ్యార్లాడుచు సోబియంబు గులుక ♦ న్వేఁదిఃమ్యవిడ్డారి మేల్
కయ్యంబున్వివరింప మెచ్చుకొనియె ♦ న్గాదారి మాదారిలోన్.

క. పొక్కిలిచన్గవ కుత్తుక
చెక్కిలికెమ్మోవి కనులఁ ♦ జెల్వపుమోముఁన్
నిక్కువముగ ముద్దులుఁగొని
చక్కఁగ తమయిచ్చసుగముఁ ♦ జరిపెను తలలో. ౧౬౪

చ. సరివయికూటమిం జెలువ ♦ సల్పుచునుండఁగ వింతవేలుపుం
దెరవసియాడె చుక్కలొగి ♦ తిన్నవవీడ్వడి చిక్కులొందె సం
బరమున గట్టులున్వడికె ♦ బల్మెరుచందురుఁగప్పె (మబ్బుల
చ్చెరువుగనీరుబొట్లువడి♦ సెన్నటిమించులుమించెనాడుచున్. ౧౬౫

తే. గీ. ఇటుల పలువితాల ♦ హెచ్చుగ వలపుల
కలయికలనుఁ దేలి ♦ కలికికటియు
మేనివేల్పుతోడ ♦ మెత్తని నుడువుల
చెంగనాలుదాను ♦ జేసిపలికె. ౧౬౬

తే. గీ. నీదుచిట్టంటువుల చేత ♦ నీదుమేని
వలపులకు నాదుడెందంబు ♦ వరగలించె
నన్నికోరికలీయక ♦ న్నయ్య తగును
వేరువేలుపు లిట్లుగా ♦ వింపఁగలరె. ౧౬౭

మ. లలియా నీయొడలిం దలంచి సిరివా ♦ లాయంబు నిన్వేఁడు కొం
దులకో నేనిఘుసంబు నిన్ను విడువన్ ♦ తోరంపు పూవిల్తు విం
దులలోనిండిన వేడ్కఁజూపి వలపు ♦ ల్దోరియంగ నీకల్మికిన్
దులలేదే వివరింపగా నలవియే ♦ తోడ్తోడ నీసత్తువన్. ౧౬౮

తే. గీ. కానసేఁ గోరుకోర్కులఁ ♦ గలుఁగఁజేసి
మనుపుమని వేఁడుకొనెనవ ♦ మారుపాటు
నొందియడిగిన కుబ్జను ♦ డెంకమందు
కట్టిమనుమఁడు రసికి న ♦ క్కజముఁగనెనె. ౧౧౯

ఆ. వె. పోఁడితిండి తపసి ♦ మొదలుగాగల రసు
లెదనుఁదలఁచి చూడ ♦ కుదురులేని
వేల్పు నెట్లుగోరె ♦ వెలఁదుక విరివిల్తు
పోరఁగవయు నట్టు ♦ లోఁయసిలలి. ౧౨౦

క. దొరకఁడు సిరికౌఁగిటిలో
దొరకండలఁ జోగికలువ ♦ దొరలకు నెపుడున్
దొరకఁడు వేల్పులకైనను
దొరికెన్వలరాయు తండ్రి ♦ తొయ్యలికి నొగిన్ ౧౨౧

క. తొలిచదువుల కందనియా
తొలిమానిసి జేజెజేజె ♦ దొరికిన యంతన్
దెలివిఁగల ముఁగితిఁగోరక
వలరాచ వవిన్నెలంగ ♦ వలెనని గోరెన్. ౧౨౨

ఆ. వె. పిల్లతనములోన ♦ పెంచిన తల్లిచే
కట్టుబడిన యట్లు ♦ కనికరమున
లేమ కౌఁగిలింత ♦ లోమిన్నమైఁ జిక్కె
నేమిపునెమొ తొల్లి ♦ నోములేనో. ౧౨౩

ఆ. వె. ముజ్జగంబులేలు ♦ ముప్పోకలానిని
కోరుకున్న చెలికి ♦ కోర్కులిచ్చి

గాచుకొనెనో లేక ♦ కపటునకుంచెనో
తెలియఁబలుకు మనిసఁ ♦ దిరిగినుడివె. ౧౨౪

ఉ. నీవనుమాటలన్నివిని నిక్కము ♦ బత్తులబత్తి నెడ్డలో
గావఁగ నీవెయంచనెడు ♦ కర్నకమున్విని నంతలోవలన్
బోవకయుండునే యతని ♦ బుద్దినిగల్గిన కోర్కెలీయకే
దేవరయుండు నేమనకు ♦ తెల్లముగావలవేల్పు చెయ్దముల్. ౧౨౫

ఆ. వె. ఔరవాని చెట్ట ♦ నమరఁగఁ బట్టిన
గొల్లకన్నెకలునుఁ ♦ గొనిరి ముగితి
యతడు కేలబట్టి ♦ సతముఁబ్రోచెడు వారి
కరయ కలుసమన్న ♦ నలనుఁగలడె. ౧౨౬

ఆ. వె. చుట్టమయ్యెఁగాని ♦ సూడు చేతనుగాని
కలఁతనైనఁగాని ♦ కలసిఁగాని
బగితినైనఁగాని ♦ బల్మారువానితో
పొందుసేయఁగలుఁగు ♦ ముందు ముగితి. ౧౨౭

క. మునుకలవమియ్యతనుదా
ల్చిన ప్రేముడిపెను కులాడ ♦ చినిమగపనిలో
తనినననుండు మటంచని
వినిపించిన నంతసించి ♦ వెన్నుడువేడ్కన్. ౧౨౮

ఉ. కోరినకోర్కె లిత్తునని ♦ కుబ్జకువెన్నుఁడు నిండువేడ్కపెం
పారఁగ బల్కుగంబులను ♦ హాళిసెలంగఁగ గబ్బిగుబ్బలన్
బోరున నంటకౌఁగిలిడి ♦ పూవిలుకాని దురంబునైనమున్
మీరలచాలఁ దెల్పిచెలి ♦ మిన్ననుఁగూడి పరుండె నంతటన్. ౧౨౯

చ. కలువలు మోముమూసె కడ ♦ గండ్లకు తావగు చందమామపు
ల్గులమదిరోసె, జక్కవల ♦ గోములఁబోవిడి గ్రేణిసేసె చు
క్కలగమిమాసె, తామరలు ♦ క్రన్నఱఁబాసె, బిరానకోడిగుం
పులుఁ దమిఁగూసె పక్కులట ♦ పోణిమిచెట్లనుఁబాసె నంతటన్.

మ. కులుకున్నిద్దపు చెక్కులన్మొనయు ♦ నొక్కుల్ వేసలిన్రాచిత
ముమ్మలముల్తాపుకిలించి బోకముడులం ♦ బొంకంబుగా గట్టిని
చ్చలు సొంపొందఁగ ముంగురుల్నిమిరియి ♦ చ్చన్గంకియుం గోరన
త్తలబీతిన్విరి పొన్పులండిగిరి జేం ♦ డ్లంచాలులేయంచొగిన్. ౧౮౧

తే. గీ. పాయమును గల్గుతమ్మిమే ♦ ల్రాయని మది
మెచ్చరే రాజువినుచెలి ♦ మిన్నముదుక
డనుచు క్రిందుగ బడద్రొబ్బ ♦ నట్లుమామ
పాఱెలెపడమటి కొండపై ♦ బాజులెడలి. ౧౮౨

క. గందపు మలనెత్తమ్ముల
కందువమేత్తీవయిండ్ల ♦ కడివిరిపొన్పున్
జెంది సుగించిన చెంచుల
యందపుచన్గవ జవాది ♦ యుంది సురలొగిన్. ౧౮౩

క. తారాడుచుండ పజలను
కూరుకు విడనాడి మేలు ♦ కొనుటకు తానే
కోరికలేపెడు వాడన
తూరుపుఁదెస వేఁగుజుక్క ♦ తురుతునఁ బొడిచెన్. ౧౮౪

తే. గీ. బమ్మచారులు మొదలైన ♦ బాపలెల్ల
మేలుకాంచి సతంబును ♦ మెలఁగదగిన

సేతలను తానమాడియు ♦ సేమములర
సందెగిడిగిళ్లు సలిపిరి ♦ సరిఁగబగితి. ౧౨౭

తే. గీ. చెలియకుబ్జను కన్నయ్య ♦ చేరిమరుని
రంతులనుదెల్పి నిదురించె ♦ రానఁజెలఁగ
మేలుకొలుపఁగఁ దగునని ♦ మించివచ్చి
కొక్కొరకొయుంచు కోళ్లటఁ ♦ గూసె పెలుచ. ౧౨౮

ఆ. వె. వినుతకొడుకుఁ గలుఁగ ♦ వెలసిన యరదము
తోడసిరివెలుంగ ♦ తొడరుబాయ
నందితూర్పు కొండ ♦ నలరె ముప్పొకల
తారుచున్న వేల్పు ♦ తళుకులెసఁగ. ౧౨౯

ఆ. వె. ప్రొద్దుఁబొడువ తమ్మి ♦ పొక్కిలి మేల్కొని
తానమాడుపనుల ♦ తమకమునను
దీర్చి సుగముగదుర ♦ తిరుగుచు లేకల
గమినిఁబ్రోచు చుండె ♦ గారవమున. ౧౩౦

చ. కుమరితయైన కుబ్జమెదఁ ♦ గోరినయట్టుల వెన్నుఁదొంగ వ
చ్చి మరులుమాన్పి యింటఁబసఁ ♦ జేసినకోమలు డెంతొపెద్దవే
డ్కమది జెలంగ బత్తికెయి ♦ కారును గద్పుచు సంతసించియుం
డె మరుని గన్నతండిరిక ♦ డిందగు వేరులనెంచి నెమ్మిగన్. ౧౩౧

మ. సనకుండు న్మొదలైన జోగులెదలో ♦ సంతోసముంజెంది చూ
చినఁ గానంబడనట్టి వేల్పునకుఁ దా ♦ చేదమ్ములం గల్గుచ
క్కని గందంబుల నిచ్చినందులకు వే ♦ గవ్వచ్చి మన్నించె గ్రొ
న్ననవిల్దారిగలంచి నెల్తుకనురా ♦ నంగొన్ని నాళ్ళుండియున్. ౧౩౨

చ. ఇటువలె కుబ్జవెన్నునకు ♦ నేర్తైఁబొనిసె చెయ్వులెల్లయూ
రటఁగొనకే యొనర్చుచుత ♦ రల్పగ సత్తువలేని బాగెముల్

బటువుగనొంది పాటలర ♦ వాళులు హెచ్చఁగ సెజ్జగీములో
చిటిపొటిమాట లన్నొగని ♦ చిక్కనిరంతులఁ జిక్కియుండఁగన్.

క. ఏ వేసట లేకుండఁగ
పూవిల్తుని పోరులోనఁ ♦ బూవిల్తునకున్
బూవిల్తుఁడైన కన్నయ
తో వేఁడుకనుండె కొడుకు ♦ తొరలుట కొఱకై. ౧౯౨

సీ. కన్నయ్యనిబ్బరి ♦ కప్పుఁజూపులో కుబ్జ
పడఁతికి దనయొక్క ♦ పాలువలన
మంచికారున నెల ♦ మసలెనుగొంతికి
మోమున తెలుపెక్కె ♦ ముడుతవిప్పె
బొజ్జను తడఁబడె ♦ బుడిబుడి నడుకలు
కోర్కులు మెండయ్యె ♦ కులుకులెడలె
బోనముపై యిచ్చ ♦ బొత్తిఁగ లేదయ్యె
చిట్టుముల్బలిసెను ♦ చిట్టుకముఁగ

గీ. వంగడము నిల్పుటకు నయి ♦ వరలుచున్న
కొమరితనుఁ జూచి కమలియు ♦ కోమలుండు
నంతసంబను సంద్రము ♦ నొంతొనోల
లాడిరి నెలంత వేవిళ్ల ♦ తోడ మెలఁగె. ౧౯౩

వ. ఇట్లు తొమ్మిది నెలలు జరుగునంత నొక్కసోబన మూరుతమ్మున గాములు తమతమ సొంతపుతావులను మూడారువదనకొండ వతానకంబుల కొందరుండ నొక్కకొమారుండుఁ గలిగె నతనికి పెద్దల నొడబాటుచే నుపశ్లోకుండను పేరుతో నలరారె వాఁడుఁ దన తండ్రియైన కన్నయ్య యడుగుఁదమ్ములఁ గొలుచుచు నాశ్వేరపురుసిచందురునకుఁ జట్టైబానిసముఁ గావించుచు మిక్కిలి·

యక్కజంబుగాఁ దెలియుందగిన తెలివినిఁ దెలిసి యతం డాఁడు వారిని నాలవకొలంబువారిని బానిసె మొదలగు పజలనుఁ జక్కఁ జేయఁదగినదియై ఖిక్కలి తలంచినంతనే ముగితిం గలుఁగనేయు నట్టి (సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి) యనెడు పొత్తముఁగలిగించె. నదిమొదలు నేటివరకు కన్నయ్య బగితిఁగలవారికి విడువరాని పాడియై నలరారె. కావున నీ కతరతనము నేరికైననుడివిన నుడువగవినిన చెప్పించిన బాగెసుఁగలవారికి వెన్నుండున్న మొల్నాడు గలుగును. ౧౯౪

ఆ. వె. అనుచు శుకుడుకఱ్ఱి ♦ మనుమనికిని కుబ్జ
కతను నునువులైన ♦ కమ్మనైన
నుడువులడరఁజెప్పె ♦ కడు పరిక్షింత్తుండు
చెవులు చవులునొంద చెలఁగిదెలిసె. ౧౯౫

క. సోబనములు నరసింగా
సోబనములు వేల్పుగొండ ♦ సుద్దిగలబసా
సోబనము లచ్చితేడా
సోబనములు వేల్పుపెద్ద ♦ చూలిపొగడ్తా. ౧౯౬

చ. అడుగులజాలుకుందనపు ♦ టందపుసాలుకడిందిముత్తికిం
బొడవగుప్రోలుతమ్మినెల ♦ వుంగలనెల్తుకయాలుఁబత్తులం
గడువడిఁబ్రోచుకేలుబరి ♦ గండడగించెడు చుట్టువాలుమై
బెడగుల మ్రబ్బుడాలు గల ♦ ప్రెగ్గడరక్కసిహత్తిసింగమా. ౧౯౭

(తోటకవృత్తము)

తొగకంటువు కం ♦ దుడుదేవరలు
న్పొగడ న్రితనం ♦ బుల పోణిమనం
దగువేలుపు గొం ♦ డను తానకమై
మిగుల న్వెలిఁజిమ్మ ♦ న మేల్చిరుదా. ౧౯౮

(౧౯౬౯ విక్రమార్కశకం)  [తృతీయా

క. కననవమణ్ణ వశశిసం
ఖ్యనిగుడఁగల విక్రమార్క ♦ హాయనమున సా
గెనుకీలకమాఖ సితచతు
ర్థిని నీకవితను ముగించి ♦ తిని మెచ్చ బుధుల్. ౧౯౯

(గద్యం.)

ఇది శ్రీమద్రమాంగనాంగ మందారలతోత్తుంగ స్తన స్తబకస్థిత
శృంగార భృంగాయమానలక్ష్మీ నృసింహకృపాలబ్ధ వాగ్వి
భవ భగవద్భాగవతార్చనాతత్పర చతుర్విధ కవితా
పరిబంధ నిర్మాణచాతుర్యధురీణ ఆంధ్రభాషా
ప్రవీణ హారితసగోత్ర పవిత్ర రంగాచార్య
పుత్ర నల్లంతిఘల్ చక్రవర్తుల తంయ్యాల
లక్ష్మీనృసింహార్య కవినాథ ప్రణీతంబైన
అచ్చ తెనుఁగు కుబ్జాకృష్ణవిలాసం
బను సింగారకబ్బంబు నందు
తృతీయాశ్వాసము సర్వం
సంపూర్ణం శ్రీకృష్ణ
పరబ్రహ్మణేనమః
శ్రీమతేరా
మానుజా
యన
మః
శ్రీ